స్త్రియః । హవిష్యంసఘృతంచైవ వరలక్ష్మ్యై నివేదయేత్ ॥ గంధాదిభిరలంకృత్య ముత్తైదుంవృద్ధభూసురం । తస్మైదత్వావాయనంచ దక్షిణాఫలసంయుతం ॥ తతోదేవీనమీపేతు హవిష్యచతురంగనాః । అథలక్ష్మీప్రసాదేన ముక్తామాణిక్యభూషితాః । నూపురాక్రాంతచరణా మణికాంచన భూషితాః। పుత్రపౌత్రైఃపరివృతా ధనధాన్యసమృద్ధిభిః। అన్నదానరతానిత్యం బంధుపోషణతత్పరాః ॥ స్వంస్వంసద్మ సమాజగ్ముర్హ స్త్యశ్వరథసంకులాః॥ అన్యోన్యస్త్రాంఛయమాను శ్రుత్వైతంచారుమతీముఖాత్ । ఇదంసత్యమిదం సత్యం వర్ణోత్సభద్రాణిపశ్యతి । వయంచారు మతీముఖ్యా ఉపలబ్ధమనోరథాః। పుణ్యాచారుమతీధన్యా భూయోభాగ్యవతీదిశం । స్వప్నంయస్యా మ్మహాలక్ష్మ్యా బోధితంహ్యవ్రతోత్తమం। ఇతిచారుమతీంసాధ్వీంతుష్టువుస్సర్వయోషితః। వరలక్ష్మీవ్రతంనామ తదాది భువివిశ్రుతం ॥ ఏతత్తేసర్వమాఖ్యాతం వ్రతానాముత్తమంవ్రతం ॥ యాఇదం శృణుయాద్వాపి శ్రావయేద్వాసమాహితః । సిధ్యంతిసర్వకార్యాణి వరలక్ష్మీప్రసాదతః ॥ ఇతిశ్రీభవిష్యోత్తరపురాణే-పార్వతీపరమేశ్వరసంవాదే-వరలక్ష్మీవ్రతకల్పస్సంపూర్ణః.

## కథా ప్రారంభము.

సూతపౌరాణికుండు శౌనకుడు మొదలగుమహర్షులంజూచి యిట్లనియె. మునివర్యులారా! స్త్రీలకు సర్వసౌభాగ్యములు గలుగునట్టి యొకవ్రతరాజంబును పరమేశ్వరుడు పార్వతీదేవికిం జెప్పె. దానిం జెప్పెద వినుండు కైలాసపర్వతమున వజ్రవైడూర్యాది మణిగణఖచితంబగు సింహాసనంబునందు పరమేశ్వరుండు గూర్చుండియుండ పార్వతీదేవి పరమేశ్వరునకు నమస్కరించి దేవా! లోకమున స్త్రీలు యేవ్రతంబొనర్చిన సర్వసౌభాగ్యములను పుత్రపౌత్రాదులుంగలిగి సుఖముగనుందురో అట్టివ్రతము నాకానతీయవలయునన నప్పరమేశ్వరుండిట్లనియె. ఓమనోహరీ! స్త్రీలకు పుత్రపౌత్రాదిసంపత్తుల గలుగంజేసెడి వరలక్ష్మీవ్రతం బను నొకవ్రతముగలదు. ఆవ్రతమును శ్రావణమాస శుక్లపక్షపూర్ణిమకు ముందుగవచ్చెడి శుక్రవారమునాడు చేయవలయుననిన పార్వతీదేవి యిట్లనియె. ఓలోకారాధ్యా! నీవానతిచ్చిన వరలక్ష్మీవ్రతమును నెట్లుసేయవలయు. ఆవ్రతమునకు విధియేమి. యేదేవతను బూజింపవలయు. పూర్వం బెవరిచే యీవ్రతం బాచరింపబడియె. వీటినెల్ల వివరముగావచియింపవలయునని ప్రార్థించిన పరమేశ్వరుండు పార్వతీదేవింగాంచి ఓకాత్యాయనీ! వరలక్ష్మీవ్రత సవిస్తారముగ జెప్పెదవినుము. మగధదేశమున కుండినంబను నొకపట్టణముగలదు.

అప్పట్టణము బంగారు ప్రాకారములతోడను బంగారు గోడలుగల యిండ్ల తోడను గూడియుండును. అట్టిపట్టణమునందు చారుమతియను నొకబ్రాహ్మణస్త్రీగలదు. ఆవనితామణి పెనిమిటిని దేవునితో సమానునిగా దలంచి ప్రతిదినమును నుదయమున మేల్కాంచి స్నానముచేసి పుష్పములచేపెనిమిటినిబూజచేసి పిదప యత్తమామలకు యనేకవిధములైన యుపచారంబులంజేసి యింటిపనులం జేసికొని గయ్యాళితనాక మితముగాను బ్రియముగాను భాషించుచునుండెను. ఇట్లుండ అన్మహాపతివ్రతయందు మహాలక్ష్మికి యనుగ్రహముగలిగి యొకనాడు స్వప్నమున ప్రసన్నయై ఓచారుమతీ! నేను వరలక్ష్మీదేవిని నీయందు నాకు అనుగ్రహము గలిగి ప్రత్యక్షమైతిని. శ్రావణశుక్లపూర్ణిమకు ముందుగావచ్చెడు శుక్రవారమునాడు నన్నుబూజించిన నీవు కోరినవరములనిచ్చెదనని వచించిన చారుమతీదేవి స్వప్నములోనే వరలక్ష్మీదేవికి ప్రదక్షిణనమస్కారములుచేసి "నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే, శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణువక్షస్థలాలయే" అని యనేకవిధముల స్తోత్రముచేసి ఓజగజ్జననీ! నీకటాక్షముగలిగనేని జనులు ధన్యులుగను, విద్వాంసులుగను, సకలసంపన్నులుగను నయ్యెదరు. నేను జన్మాంతరమునజేసిన పుణ్యవిశేషమువలన మీపాదదర్శనము నాకు గలిగెననిచెప్పిన మహాలక్ష్మి సంతోషముజెంది చారుమతికి యనేక వరములిచ్చి యంతర్ధానమునొందె. చారుమతి తక్షణమున నిదురమేల్కాని ఇంటికి నాలుగుప్రక్కలంజూచి వరలక్ష్మీదేవినిం గానక ఓహో! మనము కలగంటిమని ఆ స్వప్నవృత్తాంతమును పెనిమిటి మామగారు మొదలైనవాండ్రతోజెప్పి వారు యీస్వప్నము మిగుల నుత్తమమైనది. శ్రావణమాసంబువచ్చినతోడనే వరలక్ష్మీవ్రతం బవశ్యంబుగజేయ జేయవలసినదని చెప్పిరి. పిమ్మట చారుమతీదేవియును స్వప్నమువిన్నస్త్రీలును శ్రావణమాసం బెప్పుడువచ్చునని యెదురుజూచుచుండిరి. ఇట్లుండగా వీరి భాగ్యోదయంబువలన శ్రావణమాసపూర్ణిమకు ముందుగవచ్చెడి శుక్రవారము వచ్చెను. అంత చారుమతి మొదలగుస్త్రీలందరును యీదినంబేగదా వరలక్ష్మీదేవిచెప్పిన దివంబని నుదయంబుననే మేల్కాంచి స్నానములంజేసి చిత్రవస్త్రములం గట్టుకొని చారుమతీదేవి గృహంబున నొకప్రదేశమునందు గోమయంబుచే నలికి మంటపంబేర్పరచి యందొక ఆసనంబువైచి దానిపై క్రొత్తబియ్యముపోసి మఱ్ఱిచిగుళ్ళు మొదలగు పంచపల్లవంబులచే కలశంబేర్పరచి యందు వరలక్ష్మీదేవిని ఆవాహనముచేసి చారుమతిమొదలగు స్త్రీలందరు

మిగులభక్తియుక్తులై సాయంకాలంబున "పద్మాసనే పద్మకరే సర్వలోకైకపూజితే, నారాయణప్రియే దేవి సుప్రీతాభవసర్వదా" అను శ్లోకంబు కంబుచే ధ్యానావాహనాది షోడశోపచారపూజలంజేసి తొమ్మిదిసూత్రంబులుగల తోరంబును దక్షిణహస్తమున గట్టుకొని వరలక్ష్మీదేవికి నానావిధభక్ష్యభోజ్యములను నివేదనముచేసి ప్రదక్షిణముచేసిరి. ఇట్లొకప్రదక్షిణముచేయుగ నాస్త్రీలకందఱికి కాళ్లయందు ఘల్లుఘల్లుమను నొకశబ్దముగలిగె. అంత కాళ్లజూచికొనిన గజ్జెలు మొదలగు ఆభరణములు గలిగియుండగ చారుమతిమొదలగు స్త్రీలందరును ఓహో! వరలక్ష్మీదేవి కటాక్షమువలన గలిగినవని పరమానందము నొంది మఱియొక ప్రదక్షిణముచేసిన హస్తములందు దగద్ధగాయమానముగ మెఱయుచుండు నవరత్నఖచితములైన కంకణములు మొదలగు నాభరణములుండుటంగనిరి. ఇంతచెప్పనేల! మూడవప్రదక్షిణము గావించినతోడనే ఆస్త్రీలందరు సర్వభూషణాలంకృతులైరి. చారుమతి మొదలగు ఆస్త్రీలగృహములెల్ల స్వర్ణమయములై రథగజతురగావాహనంబులతోడ నిండియుండెను. అంత నాస్త్రీలందోడ్కొని గృహములకుబోవుటకు వారివారియిండ్లనుండి గుఱ్ఱములు ఏనుగులు రథములు బండ్లును నాస్త్రీలు వరలక్ష్మీదేవిని బూజించుచుండెడిస్థలమునకువచ్చి నిండియుండెను. పిదప చారుమతి మొదలగు స్త్రీలందరును తమకు కల్పోక్తప్రకారముగ బూజజేయించిన బ్రాహ్మణోత్తముని గంధపుష్పాక్షతలచే బూజించి పండ్రెండుకుడుములు వాయనదానంబిచ్చి దక్షిణతాంబూలములొసంగి నమస్కారముచేసి ఆబ్రాహ్మణోత్తమునిచే ఆశీర్వాదమునొంది వరలక్ష్మీదేవికిని వేదనముచేసిన భక్ష్యములను బంధువులతోడ నెల్లరనుభుజించి తమకొఱకువచ్చి కాచుకొనియుండెడి గుఱ్ఱములు ఏనుగులు మొదలగు వాహనములందెక్కికొని తమతమయిండ్లకుబోవుచు ఒకరితోనొకరు ఓహో! చారుమతిదేవి భాగ్యంబేమని చెప్పవచ్చును. వరలక్ష్మీదేవి తనంతటనే స్వప్నములోవచ్చి ప్రత్యక్షంబాయెను. ఆ చారుమతీదేవివలననేగదా మన కిట్టిమహాభాగ్యసంపత్తులు గలిగెనని చారుమతీదేవిని మిక్కిలి పొగడుచు తమతమయిండ్లకు బోయిచేరిరి. పిదప చారుమతి మొదలగుస్త్రీలందరు ఈవ్రతమును ప్రతిసంవత్సరము చేయుచు పుత్రపౌత్రాభివృద్ధిగలిగి ధనకనకవస్తు వాహనములతోడం గూడుకొని సుఖముగనుండిరి. కావున ఓ పార్వతీ! ఈ యుత్తమమైనవ్రతమును బ్రాహ్మణాది నాలుగుజాతులవారును జేయవచ్చును. అట్లొనర్చిన సర్వసౌభాగ్య

ముసుంగలిగి సుఖముగనుందురు. ఈ కథను వినువారలకును చదువువారలకును వరలక్ష్మీప్రసాదమువలన సకలకార్యములు సిద్ధించును.

---

# అనంతవ్రతకల్పము.

---

ఏవంగుణ-విశేషణ-విశిష్టాయాం-శుభతిథౌ-అస్మాకం సకుటుంబానాం-క్షేమస్థైర్య విజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థకామమోక్ష చతుర్విధపురుషార్థ సిద్ధ్యర్థం - సన్తానసౌభాగ్య శుభఫలావాప్త్యర్థం వర్షేవర్షే ప్రయుక్త శ్రీమదనంత పద్మనాభ దేవతా ముద్దిశ్య శ్రీమదనంత పద్మనాభ దేవతా ప్రీత్యర్థం పద్మపురాణోక్త ప్రకారేణ యావచ్ఛక్త్యా ధ్యానావాహనాది షోడశోపచార పూజాంకరిష్యే.

కలశపూజా.

తదంగత్వేన కలశపూజాంకరిష్యే ॥ కలశం గంధపుష్పాక్షతైరభ్యర్చ్య కలశోపరి హస్తంనిధాయ ॥ శ్లో ॥ కలశస్యముఖేవిష్ణుః కంఠేరుద్రస్సమాశ్రితః । మూలేతత్రస్థితో బ్రహ్మ మధ్యేమాతృగణాస్స్మృతాః ॥ కుక్షౌతుసాగరాస్సర్వే సప్తద్వీపావసుంధరా । ఋగ్వేదోథయజుర్వేద స్సామవేదోహ్యథర్వణః ॥ అంగైశ్చసహితాస్సర్వే కలశాంబుసమాశ్రితాః । ఆయాంతుదేవపూజార్థం దురితక్షయకారకాః ॥ గంగేచయమునేచైవ గోదావరి సరస్వతి । నర్మదేసింధుకావేరి జలేస్మిన్సన్నిధింకురు ॥ ఏవం కలశపూజాంకృత్వా మయాక్రియమాణానంత వ్రతాంగయమునా పూజాంకరిష్యే॥

యమునాపూజా.

క్షీరోదార్ణవసంభూతే ఇంద్రనీలసమప్రభే । ధ్యానంకరోమి యమునే విష్ణురూపి నమోస్తుతే ॥ యమునాయైనమః ॥ ధ్యాయామి ॥ యమునేతే నమస్తుభ్యం సర్వకామప్రదాయిని। ఆవాహయామిభక్త్యాత్వాం సాన్నిధ్యం కురువ్రతే॥ ఆవాహయామి॥ నమస్కరోమియమునే సర్వపాపప్రణాశిని । రత్నసింహాసనందేవి స్వీకురుష్వమయార్పితం॥ ఆసనం సమర్పయామి॥ నందిపాదేనమస్తుభ్యం సర్వాఘౌఘనివారిణి । అర్ఘ్యంగృహాణయమునే మద్దత్తమిదముత్తమమ్ ॥ అర్ఘ్యంసమర్పయామి ॥ సింహాసనసమారూఢే దేవశక్తి

సమన్వితే । పాద్యంగృహాణ దేవేశి సర్వలక్షణ సంయుతే ॥ పాద్యంసమర్పయామి ॥ హరిద్రా దూర్వసంయుక్తే సర్వలోకహితేశివే । గృహాణాచమనం దేవి శంకరార్ధశరీరిణి ॥ ఆచమనీయంసమర్పయామి ॥ దేవపాదసముద్భూతం సర్వలోకహితప్రియే । సర్వపాపప్రశమని తుంగభద్రే నమోస్తుతే ॥ స్నానం సమర్పయామి ॥ గురుపాదసముద్భూతం సర్వగుణసంయుతం । సుప్రసంను రుమేదేవి తుంగభద్రే నమోస్తుతే ॥ వస్త్రంసమర్పయామి ॥ కృష్ణవేణిసముద్భూతం కృష్ణవేణిసులక్షణే । సుగంధం గృహాణేదం మయాదత్తం శుభప్రదే ॥ సుసూత్రం సమర్పయామి ॥ నందిపాదసముద్భూతం శంకరార్ధశరీరిణి । సర్వలోకహితేసుభద్రే భీమరథ్యై నమోస్తుతే ॥ ఆభరణాని సమర్పయామి ॥ సహ్యపాదసముద్భూతే సర్వకామఫలప్రదే । సర్వగుణసంయుక్తే భవనాశిని తేనమః ॥ ఉత్తరీయంసమర్పయామి ॥ కృష్ణపాదసముద్భూతే గంగే త్రిపథగామిని । జటాజూటసముద్భూతే సర్వకామఫలప్రదే ॥ గంధాన్ సమర్పయామి ॥ గోదావరిసముద్భూతం సర్వాభీష్టప్రదాయినీ । స్వీకురుష్వ గద్యంచ్యే అక్షతానమలాన్ శుభాన్ ॥ అక్షతాన్సమర్పయామి ॥ మందారైః పారిజాతైశ్చ పాటలాశోకచంపకైః । పూజయామిశివప్రీత్యై వరదే భక్తవత్సలే ॥ పుష్పాణిం పూజయామి ॥

అథాంగపూజా.

చంచలాయైనమః పాదౌపూజయామి ॥ సుజంఘాయైనమః-జంఘే పూజయామి ॥ చపలాయైనమః-జానునీపూజయామి ॥ పుణ్యాయైనమః-ఊరూ పూజయామి ॥ కమలాలయాయైనమః- కటింపూజయామి ॥ గోదావర్యై నమః- స్తనౌపూజయామి ॥ భవనాశిన్యైనమః-కంఠంపూజయామి ॥ తుంగభద్రాయైనమః-ముఖంపూజయామి ॥ సుందర్యైనమః-లలాటం పూజయామి ॥ దేవ్యైనమః-నేత్రంపూజయామి ॥ పుణ్యశ్రవణకీర్తనాయైనమః- కర్ణౌ పూజయామి ॥ సునాసికాయైనమః - నాసికాంపూజయామి ॥ భాగీరథ్యైనమః-శిరఃపూజయామి ॥ యమునాయైనమః-సర్వాణ్యంగాని పూజయామి ॥ దశాంగంగుగ్గులోపేతం చందనాగరుసంయుతం । యమునాయైనమస్తుభ్యం ధూపోయంప్రతిగృహ్యతాం ॥ ధూపంసమర్పయామి ॥ ఘృతవర్తియుతందీపం త్రైలోక్యతిమిరాపహం । గృహాణమంగళం దేవి సర్వేశ్వరి నమోస్తుతే ॥ దీపంసమర్పయామి ॥ సర్వభక్ష్యైశ్చభోజ్యైశ్చరసైష్షడ్భిసమన్వితం । నైవేద్యంగృహ్యతాందేవి యమునాయై నమోనమః ॥ నైవేద్యంసమర్పయామి ॥ పానీయంపావనంశ్రేష్ఠం గంగాదిసరిదుద్భవం । హస్తప్రక్షాళనార్థంవై

గృహాణసురపూజితే॥ హస్తప్రక్షాళనం సమర్పయామి ॥ కర్పూరవాసితం చూర్ణం క్రముకాద్యైస్సమన్వితం । తాంబూలంగృహ్యతాందేవి యమునాయైనమోస్తుతే॥ తాంబూలంసమర్పయామి॥ నీరాజనమంత్రపుష్పం-ప్రదక్షిణనమస్కారాన్ ॥ యస్యస్మృత్యాచనామోక్త్యా తపఃపూజా క్రియాదిషు । న్యూనం సంపూర్ణతాంయాతి సద్యోవందేతమచ్యుతం ॥ యమునాపూజావిధానం సంపూర్ణం.

అనంతరం శ్రీమదనంతపద్మనాభం ధ్యాయేత్ ॥ శ్లోకాః॥ కృత్వాదర్భమయం దేవం పరిధానసమన్వితం । ఫణైస్సప్తభిరావిష్టం పింగళాక్షం చతుర్భుజం॥ దక్షిణాగ్రకరేపద్మం శంఖంతస్యాప్యధఃకరే । చక్రమూర్ధ్వకరే వామేగదాంతస్యాప్యధఃకరే॥ దధానంసర్వలోకేశం సర్వాభరణభూషితం। అవ్యయంసర్వలోకేశం పీతాంబరధరంహరిం॥ దుగ్ధాబ్ధిశాయినం ధ్యాత్వా చైవమావాహయేత్సుధీః । ఓంనమోభగవతే వాసుదేవాయేత్యనేనమంత్రేణాఘ్రారోప్య కృపిశేషణపిష్టం శ్రీమదనంతధ్యాయేత్ ॥ ధ్యానం ॥ ఆగచ్ఛానంతదేవేశ తేజోరాశేజగత్పతే । ఇమాంమయాకృతాంపూజాం గృహాణసురసత్తమ॥ ఆవాహనం॥ అనంతాయనమస్తుభ్యంసహస్రశిరసేనమః। రత్నసింహాసనంచారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥ ఆసనం॥ తస్యాగ్రతో దృఢంసూత్రం కుంకుమాక్తంసు దోరకం । చతుర్దశగ్రంథియుక్త ముపకల్ప్యప్రపూజయేత్॥ దోరస్థాపనం॥ అనంతగుణరత్నాయ విశ్వరూప ధరాయచ॥ అర్ఘ్యందదామితేదేవ నాగాధిపతయేనమః॥ అర్ఘ్యంసమర్పయామి॥ సర్వాత్మన్సర్వలోకేశ సర్వవ్యాపిన్సనాతన । పాద్యంగృహాణభగవన్ దివ్యరూపనమోస్తుతే॥ పాద్యంసమర్పయామి॥ దామోదరనమస్తేస్తు నరకార్ణవతారక । గృహాణాచమనం దేవ మయాదత్తంహికేశవ॥ ఆచమనీయంసమర్పయామి ॥ అనంతానంతదేవేశ హ్యనంతఫలదాయక । దధిమధ్వాజ్యసమ్మిశ్రం మధుపర్కందదామితే ॥ మధుపర్కంసమర్పయామి ॥ అనంతగుణగంభీర విశ్వరూపధరానఘ । పంచామృతైశ్చవిధివత్స్నాపయామిదయానిధే॥ పంచామృతస్నానం ॥ గంగేచయమునేచైవ గోదావరిసరస్వతీ । నర్మదేసింధుకావేరీ జలేస్మిన్ సన్నిధింకురు । జలంప్రకల్పయే తీర్థం సర్వపాపప్రముక్తయే॥ శుద్ధోదకస్నానం ॥ శ్రీధరాయనమస్తుభ్యం విష్ణవేపరమాత్మనే॥ పీతాంబరం ప్రదాస్యామి హ్యనంతాయనమోస్తుతే ॥ వస్త్రంసమర్పయామి॥ నారాయణనమస్తేస్తు త్రాహిమాం భవసాగరాత్ । బ్రహ్మసూత్రంచోత్తరీయం గృహాణపురుషోత్తమ॥ ఉపవీతంసమర్పయామి॥ శ్రీగంధం

చందనోన్మిశ్రం కుంకుమాదిభిరన్వితం। విలేపనంసురశ్రేష్ఠప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం। గంధాన్ సమర్పయామి। శాలీయాన్ తండులాన్ రమ్యాన్ మయాదత్తాన్ సుధావహాన్। అచ్యుతానంత గోవింద హ్యక్షతాన్ స్వీకురు ప్రభో। అక్షతాన్ సమర్పయామి॥ కరవీరైర్జాతి కుసుమైశ్చంపకైర్వకుళైశ్శుభైః। శతపత్రైశ్చకల్హారై రర్చయే త్పురుషోత్తమం। పుష్పాణిం పూజయామి॥

## అథాంగపూజా.

అనంతాయనమః। పాదౌపూజయామి-శేషాయనమః। గుల్ఫౌపూజయామి-కాలాత్మనేనమః। జంఘేపూజయామి-విశ్వరూపాయనమః। జానునీపూజయామి- జగన్నాథాయనమః। గుహ్యంపూజయామి-పద్మనాభాయనమః। నాభింపూజయామి-సర్వాత్మనేనమః। కుక్షింపూజయామి-శ్రీవత్సవక్షసేనమః। వక్షస్థలంపూజయామి-చక్రహస్తాయనమః। హస్తాన్ పూజయామి-ఆజానుబాహవేనమః। బాహూన్ పూజయామి-శ్రీకంఠాయనమః। కంఠంపూజయామి- చంద్రముఖాయనమః। ముఖంపూజయామి-వాచస్పతయేనమః। వక్త్రంపూజయామి- కేశవాయనమః। నాసికాంపూజయామి-గోవిందాయనమః। శ్రోత్రంపూజయామి-అనంతపద్మనాభాయనమః। శిరఃపూజయామి-విష్ణవేనమః। సర్వాంగాని పూజయామి॥

## అథాష్టోత్తర శతనామపూజా.

శ్రీకృష్ణాయనమః
కమలానాథాయ
వాసుదేవాయ
సనాతనాయ
వసుదేవాత్మజా
పుణ్యాయ
లీలామానుష
గ్రహాయనమః
శ్రీవత్సకౌస్తుభ ధ
రాయ
యశోదా వత్సలా
హరయేనమః

చతుర్భుజాత్త చ
క్రాయనమః
అసిగదశంఖాద్యు
దాయుదాయ
దేవకీనందనాయ
శ్రీశాయ
నందగోపప్రియా
త్మజాయనమః
యమునావేగ సం
హారిణేయ
బలభద్ర ప్రియా
నుజాయ

పూతనాజీవిత హ
రాయ
శకటాసుర భంజ
నందవ్రజ జనానం
దినేన
సచ్చిదానందవిగ్ర
నవనీత విలిప్తాంగా
యనమః
నవనీతనటాయ
అనఘాయ
నవనీత నవాహారా
యనమః

ముచికుంద ప్రసా
దకాయ
షోడశస్త్రీ సహస్రే
శాయ
త్రిభంగినేనమః
మధురాకృతయేన
శుకవాగమృతా
బ్ధీందవేనమః
గోవిందాయ
యోగినాం పత
యేనమః
వత్సవాటచరాయ

చమగ్రంథిం పూజయామి-భాస్కరాయనమః ॥ షష్ఠమగ్రంథిం పూజయ
మి ॥ కాలాయనమః-చతుర్థగ్రంథిం పూజయామి- బ్రహ్మణేనమః ॥ పం
చమగ్రంథిం పూజయామి-భాస్కరాయనమః ॥ షష్ఠమగ్రంథిం పూజయ
మి-శేషాయనమః ॥ సప్తమగ్రంథిం పూజయామి-సోమాయనమః॥ అష్ట
మగ్రంథిం పూజయామి -ఈశ్వరాయనమః ॥ నవమగ్రంథిం పూజయ
మి-విశ్వాత్మనేనమః ॥ దశమగ్రంథిం పూజయామి-మహాకాలాయనమః॥
ఏకాదశగ్రంథిం పూజయామి-సృష్టిస్థిత్యంతకారిణేనమః ॥ ద్వాదశగ్రంథిం
పూజయామి-అచ్యుతాయనమః ॥ త్రయోదశగ్రంథిం పూజయామి - అ
నంతపద్మనాభాయనమః ॥ చతుర్దశగ్రంథిం పూజయామి ॥ వనస్పతిభవై
ర్దివ్యైర్నానాగంధైశ్చ సంయుతః । ఆఘ్రేయస్సర్వదేవానాం ధూపోయం
ప్రతిగృహ్యతాం ॥ ధూపంసమర్పయామి ॥ సాజ్యంత్రివర్తిసంయుక్తం వ
హ్నినాద్యోతితంమయా । గృహాణమంగళం దీపం త్రైలోక్య తిమిరాపహ॥
దీపంసమర్పయామి ॥ నైవేద్యం గృహ్యతాందేవ భక్తింమేహ్యచలాంకురు।
ఈప్సితంమేవరందేహి పరత్రచపరాంగతిం ॥ నైవేద్యంసమర్పయామి ॥ అ
న్నంచతుర్విధం భక్ష్యైరసైష్షడ్భి స్సమన్వితం । మయానివేదితం తుభ్యం
స్వీకురుష్వజనార్దన ॥ పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం। కర్పూ
రచూర్ణసంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ॥ తాంభూలం సమర్ప
యామి ॥ నమస్సర్వహితార్థాయ జగదాధారమూర్తయే । సృష్టిస్థిత్యంత
రూపాయ హ్యనంతాయనమోనమః ॥ నీరాజనంసమర్పయామి ॥ మంత్ర
పుష్పం సమర్పయామి ॥ యానికానిచ పాపాని జన్మాంతరకృతానిచ। తా
నితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే ॥ ప్రదక్షిణం ॥ నమస్తే దేవదేవేశ
నమస్తే ధరణీధర । నమస్తేసర్వనాగేంద్ర నమస్తేపురుషోత్తమ॥ నమస్కా
రాన్ సమర్పయామి ॥ దారిద్ర్యనాశనార్థాయ పుత్రపౌత్రప్రవృద్ధయే । అ
నంతాఖ్యమిదంసూత్రం ధారయామ్యహముత్తమం ॥ దోరగ్రహణం ॥ అ
నంతసంసార మహాసముద్రమగ్నం సముద్ధరవాసుదేవ । అనంతరూపిణా
వినియోజయస్వ హ్యనంతసూత్రాయ నమోనమస్తే ॥ దోరనమస్కారః॥
సంసారగహ్వర గుహాసుసుఖంవిహర్తుం వాంఛంతియేకురు కులోద్భవశుద్ధ
సత్వాః । సంపూజ్యచైవ భువనేశ మనంతరూపం బధ్నంతిదక్షిణకరే వరదో
రకంతే ॥ దోరబంధనం ॥ అనన్తానంత దేవేశ హ్యనంతఫలదాయక । సూ
త్రగ్రంథిషుసంస్థాయ విశ్వరూపాయతేనమః ॥ జీర్ణదోరంవిసర్జనం - ఉపా
యనదానమంత్రః ॥ అనంతః ప్రతిగృహ్ణాతి హ్యనంతో వైదదాతిచ । అనంత

సారణోద్వాభ్యామనంతాయ నమోనమః ॥ ఇతిపూజావిధానం॥ కథాప్రా
రంభము॥ శ్లో॥ అరణ్యేవర్తమానాస్తే పాండవా దుఃఖకర్శితాః । కృష్ణం
దృష్ట్వామహాత్మానం ప్రణిపత్యయథాక్రమం । యుధిష్ఠిరః॥ అహందుఃఖే
వసంతప్తో భ్రాతృభిః పరివారితః । కథంముక్తిర్భవేదస్మాక మనంతాద్దుఃఖ
సాగరాత్॥ శ్రీకృష్ణః॥ అనంతవ్రతమిత్యస్తి సర్వపాపప్రణాశనం । సర్వసిద్ధి
ప్రదంనృణాం స్త్రీణాంచైవ యుధిష్ఠిర॥ అనంతకీర్తిదంనృణా మనంత
శ్రీకరంశుభం । అనంతపుత్రసుఖద మనంతాభీష్టదాయకం । శుక్లపక్షేచ
తుర్దశ్యాం మాసిభాద్రపదేశుభే । తస్యానుష్ఠానమాత్రేణ సర్వపాపైః ప్ర
ముచ్యతే॥ యుధిష్ఠిరః॥ కృష్ణకోయంత్వయాఖ్యాతః కోనంతఇతివిశ్రుతః। కిం
శేషో నాగరూపోవా అనంతస్తక్షకోపివా॥ పరమాత్మాథవానంత ఉతబ్ర
హ్మాస ఉచ్యతే । కోయందేవో నంతసంజ్ఞస్తథ్యంమే బ్రూహికేశవ॥ అ
నంతఇత్యహంపార్థ విశ్వరూపంనిబోధమే । ఆదిత్యగ్రహచారేణ యఃకాల
ఉపపద్యతే॥ కళాకాష్ఠాముహూర్తాది దివరాత్రశరీరవాన్ । పక్షర్తుమాస వ
ర్షాదియుగ కల్పవ్యవస్థయ ॥ యోయంకాలోమయాఖ్యాతస్సోనంత ఇతిసం
జ్ఞితః । సోహంకాలోవతీర్ణోత్రభువో భారాపనుత్తయే ॥ దానవానాంవినా
శాయ వసుదేవకులోద్భవం। మాంవిద్ధియనంతంత్వంపార్థ కృష్ణంహరింశివం॥
బ్రహ్మాణంభాస్కరంశేషం సర్వవ్యాపినమీశ్వరం । విశ్వరూపంమహాత్మా
నం సృష్టిస్థిత్యంతకారిణమ్। అనంతపద్మనాభంచ నారసింహంచవామనం।
ప్రత్యయార్థంమయపార్థ మమరూపం ప్రదర్శితమ్ ॥ పూర్వమేవ పరబ్రహ్మ
యోగిధ్యేయమనుత్తమం । విశ్వరూపమనంతంచ యస్మిన్నింద్రాశ్చతుర్దశ॥
వసవోద్వాదశాదిత్యారుద్రాయేకాదశాస్తథా । సప్తర్షయస్సముద్రాశ్చ ప
ర్వతాస్సరితోద్రుమాః ॥ నక్షత్రాణిదిశోభూమిః పాతాళం భూర్భువాదికం।
మాకురుష్వాత్రసందేహ మహమేవయుధిష్ఠిర॥

యుధిష్ఠిరఉవాచ॥ కింపుణ్యం కిం ఫలంతస్య కిం దానం కస్యపూ
జనం। కేనచాపిపురాచీర్ణం మర్త్యలోకేప్రకాశితమ్॥ ఏతత్సర్వం సవిస్తార్య
తథ్యంమేబ్రూహికేశవ ॥ శ్రీకృష్ణఉవాచ ॥ ఆసీత్ పురాకృతయుగే సుమం
తోనామవైద్విజః। వసిష్ఠగోత్రేచోత్పన్నస్సురూపాంచభృగోస్సుతామ్ ॥ దీ
క్షాంనామోపయేమే తాం వేదోక్తవిధినాతతః । తస్యాఃకాలేనసంజాతా
దుహితానంతలక్షణా ॥ శీలానామసుశీలాచ వర్ధతేమాతృవేశ్మని । మాతా
చతస్యాఃకాలేన జ్వరదాహేనపీడితా ॥ వినాశనదీతీరేమృతా స్వర్గపురం
యయౌ । సుమంతోపితతోన్యాంవై ధర్మలోపభయాత్పునః ॥ ఉపయేమేవి

జేద్దేవదేవేశం మండలే ధూపదీపకైః । దివ్యపుష్పైశ్చ నైవేద్యైః ॥ ప్రత్యే
కంచ చతుర్దశ । తస్యాగ్రతో దృఢంసూత్రం కుంకుమాక్తం సుదోరకం ।చ
తుర్దశగ్రంథియుక్త ముపకల్ప్య వ్రతపూజయేత్ ॥ పంచప్రస్థప్రమాణేన గోధు
మానాం ప్రయత్నతః । అష్టావింశతిసంఖ్యానికుర్యాన్మిశ్రాణికారయేత్ ॥ అర్ధం
విప్రాయ దాతవ్యమర్ధం భోక్తవ్యమాత్మనా । ఫలాని ప్రదాతవ్యాని సర్వాణి చ
తుర్దశసంఖ్యయా ॥ బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చాత్స్వజనైర్యుక్తశుద్ధమానసః
ధ్యాత్వా నారాయణం దేవ మనంతం విశ్వరూపిణమ్ ॥ వస్త్రైకదేశసంసూత్రం
ముక్త్వైనం తు ధారయేత్ । తతశ్చతుర్దశే వర్షే కుర్యాదుద్యాపనం బుధః ॥ భు
క్త్వా తతో వ్రజేద్గేహ మిదం ప్రోక్తం ప్రకీర్తితవ । ఇత్యుక్త్వా తాభి రార్యాభి
ర్వ్రతితాన్వహోఽప్యేవధీమతీ ॥ సాశీలాతి వ్రతంచక్రే కరే బద్ధ్వా సుతోరకం ।
పాథేయ శేషం విప్రాయ దత్త్వా భుక్త్వా తతస్సహ ॥ తస్మిన్దినే స్థితం తస్యవ్ర
సాదాద్భూతిరుత్తమా । అస్మిన్ శ్చైవ వ్రతేనైవ సంజాతం లోకసమ్మతమ్ ।
తస్యాశ్రమం శ్రీయాయుక్తం ధనధాన్యసమన్వితం । అతిథి సత్కార
శోభితం శాంతసత్తమత్ ॥ తద్వ్రష్టా బాధమానస్త్వే ప్రమోక్షం పరమంగతా ॥
అనంతవ్రతమాహాత్మ్యం ఖ్యాతం సర్వత్రగ్రామకః ॥ సాపిమాణిక్య కాంచీని
ర్యాపుంఘైశ్చవిభూషితా । దివ్యవస్త్ర సంపన్నా సావిత్రీప్రతిమా భా ॥ క
థాచి రుపవిష్టేన కౌండిన్యేన మహాత్మనా । శీలాయాహస్తమాలోకేత్ కృ
ష్ణావిబద్ధం సుతోరకమ్ ॥ కిమిదంతోరకం శీలే కస్యార్థాయ వధ్యత ।మామ
వానస్వసాచాధ కిమర్థం గృహ్యతే వ్రతః ॥ సత్యం ప్రోవాచ సాశీలా హ్యా
నంతోఽయం మయా ధృతః । తస్య ప్రసాదాత్సంజాతా ధనధాన్యాదిసంపద ॥
లభంతేసంపదస్సర్వా తదిదం కీర్తితం మయా ధృతం । తస్యాస్తద్వచనం శ్రుత్వా
నాతేసం ప్రోటికింగుమా ॥ కోనంత ఇతిదేవోఽయం బ్రువతా తేన పాపినా । త్రో
ఉత్తంబాన్వలాకుతే పహస్తాన్మహా కృత్వాప్రధానతే ॥ శీలాగృహీత్వా తత్సూ
త్రం క్షీరమధ్యే వినిక్షిపేత్ । తేనకర్మవిపాకేన తస్యసాశ్రీః క్షయంగతా ।
గోధనం తస్కరైర్నష్టం గృహంచాగ్ని విదాహితం । యత్ర యత్ర స్థితం గే
హే తత్ర తత్ర వినాశితం ॥ స్వజనైః కలహోనిత్యం వర్జితంభాషితం జనైః ॥ అ
నంతాక్షేపదోషేణ దారిద్ర్యంచాగతం గృహే ॥ నకశ్చిద్భాషితం లోకే
తేనసార్ధంయుధిష్ఠిర । తతో జగామ కౌండిన్యో నిర్వేదాద్గహనం వనం ॥ అ
నంతం మనసాధ్యాయన్ కదా ద్రక్ష్యామి కేశవం । ఏవం నిరశనం గత్వా బ్ర
హ్మచర్యం వ్రతం చరన్ ॥ విన్యాసం ప్రయయౌ పార్థ అరణ్యం జనవర్జితం । త
త్రాపశ్యన్మహాచూతం ఫలితం పుష్పితం తథా ॥ వర్జితం పక్షిసంఘైశ్చకీటకై

ఖరః కుంజరకోపి యో దృష్టో భ్రమతా హి కేశవ। మాతంగస్సిద్ధిమాపావిద్యార్థీ వి
ద్యాగర్వసమన్వితః ॥ శిష్యేభ్యో న దదౌ విద్యాం తస్మాద్వృక్షోఽభవద్ద్విజః। సా
గౌర్వసుంధరా ప్రోక్తా ప్రేక్షకః సదనాదిమాసతత్ఫలం । అన్నం శస్యాత్తృణభువి నా
త్తి పాపవశాత్తతః ॥ వృషోఽపి గన్వయుక్తస్సన్నస్మాషడిడుత్రిదోషతః। ధర్మాధ
ర్మౌ సరోయుగ్మం సఖితపరనిందకః ॥ కుంజరో సావ్విజశ్రేష్ఠ ధర్మాతిక్రమ
కోఽపరః । ఇత్యుక్త్వా కుంజమయా సర్వమనంతో విప్రరూపధృత్ ॥ చరానంతం
వ్రతం త్వంచ నవవర్షాణి సంచర । ఇతి స్తుత్వా ద్విజాస్యాయ ఉత్తమస్థానముత్త
మమ్ ॥ ఇహలోకే సువిపులాన్ సర్వాన్ కామానవాప్స్యసి । ఇతి దత్వా వ
రం దేవ స్తత్రైవాంతరధీయత ॥ కౌండిన్యోఽపి స్వయం గత్వా గేహే చచార వ్రత
ముత్తమం । శీలయా సహ ధర్మాత్మా భుక్త్వా భోగాన్యథేప్సితాన్ ॥ పుత్ర
పౌత్రైః పరివృతః స్తతో నక్షత్రకాంగతః । కేచిత్ స్థాయీ చ సంభూతో దృశ్యస్త
తేద్యాపి సద్విజః ॥ కుంభ దేవపురాచీర్ణం మర్త్యలోకే ప్రకాశితమ్ । సగరే
ణ దిలీపేన భరతేన మహాత్మనా ॥ హరిశ్చంద్రేణ భూపేన జనకేనాపి పాండవ।
ఏతే చాన్యే చ బహవో రాజ్యం భుక్త్వా దివం గతాః ॥ ఏతత్తే కథితం పార్థ వ్ర
తానాముత్తమం వ్రతం । యత్కృత్వా సర్వపాపేభ్యో విముక్తస్సుఖమశ్ను
తే ॥ యే త్విత్యనంతసకలం పఠంతి శృణుయాత్తథా । అష్టైశ్వర్యాదిభోగాంశ్చ
భుక్త్వేహాన్యజన్మస్వపి ॥ సర్వపాపైర్విముక్తాస్తే యాంతి పరమాం గతిమ్ ॥
ఇతి భవిష్యోత్తరపురాణే - శ్రీకృష్ణ యుధిష్ఠిరసంవాదే, అనంతవ్రతకల్ప
స్సంపూర్ణః.

## అనంతవ్రతకథ.

సూతపౌరాణికుండు శౌనకాది మహర్షులం గాంచి యిట్లనియె. ఓ మునిశ్రేష్ఠులారా! లోకమున మనుజుండు దరిద్రముచే పీడింపంబడుచుం డెనేని అట్టి దారిద్ర్యమును దొలంగఁజేయునట్టి యొక వ్రతశ్రేష్ఠము గలదు దానిం జెప్పెదవినుండు. పూర్వము పాండురాజపుత్రుండైన ధర్మరాజు తమ్ము లతోడ నరణ్యమున వాసము చేయుచు మిగుల కష్టములననుభవించి యొ కనాడు శ్రీకృష్ణమూర్తింగాంచి మహాత్మా! నేను దమ్ములతోడ ననేకదిన ములుగా నరణ్యవాసము జేయుచు మిగుల కష్టసముద్రమునం బడి యున్నా ను. ఇట్టి కష్టసాగరము నుండి దాటింపగల యుపాయమును జెప్ప వలయునని ప్రార్థించిన శ్రీకృష్ణమూర్తి యిట్లనియె. ఓ ధర్మరాజా! పురు షులకును స్త్రీలకును సకలపాపములం బోగొట్టి సకలకార్యముల సను కూర్చునట్టి యనంతవ్రతంబను నొకవ్రతోత్తమంబు గలదు. కృతయుగమున అ

అనంతవ్రతమును భాద్రపదశుక్ల చతుర్దశినాఁ డొనర్పవలయు. అట్లుగావించిన కీర్తియును సుఖమును శుభమును పుత్రలాభమును గలుగునని పచియించిన ధర్మరాజిట్లనియె. ఓ రుక్మిణీప్రాణవల్లభా! ఆ అనంతుండను దైవంబెవరు. అనంతాదిశేషుఁడా లేక తక్షకుఁడా లేక సృష్టికర్తయైన బ్రహ్మయా లేక పరమాత్మస్వరూపుఁడా యని యడిగిన, కృష్ణమూర్తి యిట్లనియె. ఓ పాండుపుత్రా! అనంతుండనువాఁడు నేనును. మఱియొకండుగాఁడు. సూర్యగమనవశమునఁ గళాకాష్ఠ ముహూర్తములనియు, పగలు రాత్రియనియు, యుగసంవత్సర ఋతుమాసకల్పము లనియు, నీసంజ్ఞలుగ నొప్పుచున్నకాలం బెద్దిగలదో అదియే నాస్వరూపము. నేనే కాలస్వరూపుఁడను. అనంతుండనుపేరుచే భూభారము తగ్గించుటకొఱకును, రాక్షససంహారమునకొఱకును, వసుదేవుని గృహమున జన్మించితిని. నన్ను గృష్ణునిగాను జిష్ణునిగాను, హరిహరబ్రహ్మలగాను, సర్వవ్యాపక పరమేశ్వరస్వరూపునిగాను, సృష్టిస్థితిలయకారణభూతునిగాను, అనంతపద్మనాభునిగాను, మత్స్యకూర్మాద్యవతారస్వరూపునిగాను దెలియఁగుము. ఏనాహృదయమునందు పదునలుగురింద్రులును, అష్టవసువులును, ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును, సప్తఋషులును, సరిత్సముద్రంబులును, భూర్భువస్స్వర్లోకాదులు నున్నవో అట్టి నాస్వరూపమును నీకెఱింగించితిననిన ధర్మరాజు కృష్ణమూర్తింగాంచి ఓ జగన్నాథా! నీవు చెప్పిన అనంతవ్రతం బెట్లాచరింపవలయును. ఆవ్రతంబాచరించిన నేమిఫలము గలుగు. ఏయే దానములఁ జేయవలయు. ఏ దైవమును బూజింపవలయు. పూర్వం బెవరీవ్రతం బాచరించి సుఖము జెందిరి. అనియడిగిన కృష్ణమూర్తి యిట్లనియె.

ఓ ధర్మరాజా! చెప్పెద వినుము. కృతయుగమున వసిష్ఠగోత్రోద్భవుండును వేదశాస్త్రార్థసంపన్నుండును నగు సుమంతుండను నొక బ్రాహ్మణుండు గలఁడు. అతనికి భృగుమహర్షి పుత్రికయగు దీక్షాదేవి యను భార్య గలదు. ఆదీక్షాదేవితోడ సుమంతుఁడను బ్రాహ్మణుండు చిరకాలము కాపురము సేయ దీక్షాదేవి గర్భముదాల్చి సుగుణవతియగు నొకకన్యకంగనెను. ఆబాలికకు శీలయను నామకరణంబొనర్చిరి. ఇట్లుండ కొన్ని దినములకు దీక్షాదేవి తాపజ్వరముచే మృతినొందెను. పిదప సుమంతుండు వైదికకర్మలోపభయమునుచే కర్కశయను నొకకన్యకను వివాహముఁ జేసికొనెను. ఆకర్కశ మిగుల కఠిన చిత్తురాలుగను, గయ్యాళిగను, కలహకారిణిగను నుండెను. ఇట్లుండ ప్రథమభార్యయగు దీక్షాదేవిపుత్రికయైన శీల తండ్రిగృహ

నానావిధముగ్గులుంబెట్టి ఆ వేదికకు దక్షిణపార్శ్వమున నుదకపూరితకలశ మునునిచి ఆవేదిక నడుమ సర్వవ్యాపకుండైన అనంతపద్మనాభస్వామిని దర్భతో నొనర్చి అందావాహనముచేసి "కృత్వాదర్భమయం దేవం శ్వేతద్వీపే స్థితంహరిమ్। సమన్వితంచ సప్తఫణైః పింగళాక్షంచతుర్భుజమ్" అను నీ శ్లోకంబుచొప్పున శ్వేతద్వీపవాసిగను, పింగళాక్షుండుగను, సప్తఫణసహితుండుగను, శంఖచక్రగదాధరుండుగను ధ్యానముచేసి కల్పోక్తప్రకారముగ షోడశోపచారపూజలొనర్చి ప్రదక్షిణనమస్కారములం గావించి పదునాలుగుముడులుగలిగి కుంకుమతోదడిపిన క్రొత్తతోరమును ఆ పద్మనాభస్వామి సమీపముననునిచి పూజించి అయిదుపళ్ళ గోధుమపండితో నిరువదెనిమిది అతిరసములంజేసి నైవేద్యముపెట్టి తోరముగట్టుకొని పదునాలుగుఅతిరసములను బ్రాహ్మణునకు వాయనదానమునిచ్చి తక్కినవాటిని తానుభుజింపవలసినది. మఱియు పూజాద్రవ్యములన్నియు పదునాలుగేసిగా నుండవలయును. పిదప బ్రాహ్మణసమారాధనమొనర్చి అనంతపద్మనాభస్వామిని ధ్యానింపుచునుండవలయును. ఓ శీలా! ఇట్లు వ్రతము పరిసమాప్తిచేసి ప్రతిసంవత్సరమును క్రొత్తతోరముం గట్టికొనుచు పదునాలుగవసంవత్సరమునం దుద్యాపనముచేసి మరల వ్రతము నాచరింపుచుండవలయునని చెప్పిన కౌండిన్యునిభార్యయగు శీలఅనునది తత్క్షణమున స్నానంబొనర్చి ఆ స్త్రీలసాహాయ్యమువలన వ్రతమునాచరించి తోరముగట్టుకొని త్రోవబత్తెమునకు తెచ్చిన సత్తుపిండిని బ్రాహ్మణునకు వాయనదానమిచ్చి తానును భుజించి సంతుష్టురాలై భోజనాదులచే సంతుష్టుండైన తన పెనిమిటితోడం బండినెక్కి ఆశ్రమమునకుం బోయెను. అంత శీల అనంతవ్రతం బొనరించిన నామాహాత్మ్యమువలన ఆశ్రమంబెల్ల స్వర్ణమయము గాను గృహంబెల్ల ఐశ్వర్యయుక్తముగను నుండుటంగాంచి దంపతులిద్దరు సంతోషభరితాంతరంగులై సుఖముగ కాపురముసేయుచుండిరి. సుశీలయును అనంతవ్రతముతప్పక జరుపుచువచ్చునందున వజ్రవిద్రుమ వైడూర్యగోమేధికపద్మరాగ మరకతమాణిక్యాది మణిగణఖచిత భూషణభూషితురాలై అతిథిసత్కారములం గావించుచు నుండెను. అట్లుండగ నొక్కనాడు దంపతులిరువురుం గూర్చుండియుండగ దురాత్ముండగు కౌండిన్యుండు శీల సందిటనుండు తోరముంజూచి ఓ కాంతా! నీవు సందిటయం దొకతోరముగట్టుకొనియున్నావుగదా, అదెందులకు కట్టుకొనియున్నావు. నన్ను వశ్యము చేసికొనుటకా లేక మఱియొకరిని వశ్యముచేసికొనుటకు గట్టుకొన్నా

వని యడిగిన నా శీల యిట్లనియె. ఓ ప్రాణనాయకా! అనంతపద్మనాభ
స్వామిని ధరించియున్నాను. ఆ దేవుని యనుగ్రహమువలననే మనకీ ధన
ధాన్యాదిసంపత్తులు గలిగియున్నవని యథార్థము వచించిన కౌండిన్యుండు
మిగుల క్రోధాక్రాంతుండై కండ్లెఱ్ఱజేసి అనంతుండనగా నే దేవుండని దూ
షించుచు నాతోరమును ద్రెంచి భగభగమండుచుండెడు వహ్నిలో బడవై
చెను. అంత నా శీల హాహాకారంబొనర్చుచు పరుగెత్తిపోయి ఆ తోరము
ను దీసికొనివచ్చి పాలలోవడిపెట్టెను. పిదప గొన్నిదినములకు కౌండిన్యుం
డట్టియకృత్యం బొనర్చినందువలన అతని యైశ్వర్యంబంతయు నశించి గోధ
నములు దొంగలపాలుగను గృహమగ్నిపాలుగ నాయెను. మఱియు గృ
హమునం దెచ్చటెచ్చట పెట్టినవస్తువులు అచ్చటచ్చటనే నశించెను. మా
టలాడం బోయినచోట్లనెల్ల కలహము సంభవించెను. రొచ్చటికింబోయిన
నెవరును మాట్లాడరైరి. అంత కౌండిన్యుండు దేమియుందోచక దారి
ద్ర్యమునచే బీడింపంబడుచు వనగహ్వరముం బ్రవేశించె. ఇట్లు మహారణ్య
మున్ బ్రవేశించి క్షుత్పిపాసాపీడితుండై అనంతపద్మనాభస్వామిపై జ్ఞానము
గలిగి ఆమ్మహాదేవుని నెట్లు చూడంగల్గుదునని మనమున ధ్యానింపు
చు బోయిపోయి యొక్కచోట పుష్పఫలభరితంబగు గొప్ప మామిడిచెట్టును
జూచి ఆచెట్టుపై యొకపక్షియైనను వ్రాలకుండుటం గాంచి ఆశ్చర్యము
నొంది ఆచెట్టుతో నిట్లనియె. ఓ వృక్షరాజమా! అనంతుండను నామముగల
దైవమును జూచితివా అని అడిగిన నావృక్షము నేనెఱుంగనని చెప్పెను. అం
త కౌండిన్యుండు మఱికొంతదూరముపోయి పచ్చిగడ్డిలో నివలనావల తిరు
గుచున్న దూడతోంగూడిన యొకగోవుం గాంచి ఓ కామధేనువా! అనం
తపద్మనాభస్వామిని జూచితివా అని యడిగిన నేనెఱుంగనని చెప్పెను. పిదప
కౌండిన్యుండు మఱికొంత దవ్వేగి మోకాలుమట్టు పచ్చికలో నిలుచుండి
యుండు నొకవృషభమును వీక్షించి యో వృషభరాజా! అనంతపద్మనాభ
స్వామిని జూచితివా యని యడిగిన అనంతపద్మనాభస్వామి యెవరో నేనెఱుం
గనని చెప్పెను. పిమ్మట మఱికొంతదూరము పోగా నొకచో రమ్యంబై మ
నోహరంబైన రెండు కొలంకులు తరంగంబులతోడం గూడియును, కమల
కల్హారకుముదోత్పలంబులతోడం గూడియును, హంసకారండవ చక్రవా
కాదులతోడం గూడియును, ఒక కొలనునుండి జలములు మఱియొక కొల
నికి పారుచుండుటయును గాంచి, ఓ కమలాకరములారా! మీ రనంతపద్మ
నాభస్వామినిం జూచితిరా యని యడిగెను. అందుకా పుష్కరిణులు మే మెఱుం

గమని నడిచిన కౌండిన్యుండు మతికొంతదూరముపోగా నొకచోట నొకగాడిదయును నొకయేనుగును నిలుచుండియుండెను. వాటింజూచి మీరు అనంతపద్మనాభస్వామినిజూచితిరా యనియడిగెను. అవి అనంతపద్మనాభస్వామి యెవరో మేమెఱుంగమనిచెప్పెను. అంత కౌండిన్యుడు మిగుల విషాదంబునొంది దుఃఖాక్రాంతుడై మూర్ఛబోయి క్రిందపడెను. అప్పుడు భగవంతునికి కృపగలిగి వృద్ధబ్రాహ్మణరూపధరుండై కౌండిన్యునియొద్దకు వచ్చి ఓ విప్రోత్తమా! యిటురమ్మని కుడిచెయిపట్టి పిలుచుకొని తనగృహమునకుం బోయెను. అంత నాగృహము నవరత్నమణిగణఖచితంబుగను దేవాంగనలతోడం గూడియు నుండుటం గాంచి ఆశ్చర్యము నొంది నిలుచుండియుండగ సదాగరుడసేవితుండుగను శంఖచక్రధరుండుగను నుండు తనస్వరూపమును పద్మనాభస్వామి చూపించిన కౌండిన్యుండు సంతోషసాగరమగ్నుండై భగవంతుని నిట్లని స్తుతియించె. "నమోనమస్తే వైకుంఠ శ్రీవత్స శుభలాంఛన । త్వన్నామస్మరణాత్పాప మశేషం నః ప్రణశ్యతు । నమోనమస్తే గోవిందనారాయణజనార్ధన" అని యిట్లనేకవిధముల స్తోత్రముచేసిన అనంతపద్మనాభస్వామి మిగులసంతుష్టుండై ఓవిప్రోత్తమా! నీవు చేసినస్తోత్రముచే నేను మిగులసంతసించి నీకునెల్లప్పటికిని దారిద్ర్యముసంభవించకుండునట్లును అంత్యకాలమున శాశ్వతవిష్ణులోకముగలుగునట్లును వరంబిచ్చితిననిన కౌండిన్యుండు ఆనందాంబుధిం దేలుచు నిట్లనియె. ఓ జగన్నాథా! నేత్రోవలోజూచిన ఆమామిడిచెట్టు వృత్తాంతంబేమి ఆ ఆవు యెక్కడిది. ఆ వృషభం బెక్కడనుండివచ్చె. ఆ కొలనుల విధంబేమి. ఆ గాడిద యేనుగు బ్రాహ్మణు లెవ్వరనియడిగిన భగవంతుం డిట్లనియె. ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! పూర్వమందొక బ్రాహ్మణుడు సకలవిద్యలం జదువుకొని గర్వముచే నెవరికిని విద్యచెప్పకపోవుటచే నదియెవ్వరికిని నుపయోగముగాని మామిడిచెట్టుగా జనించెను. తొల్లి యొకండు మహాభాగ్యవంతుడై యుండి తనజీవితకాలమునం దెన్నడును బ్రాహ్మణులకన్నప్రదానము జేయనందున పశువుగా బుట్టి గడ్డియైనను దొరకక పచ్చిగడ్డికై తిరుగుచున్నాడు. ముందొకరాజు ధనమదాంధముచే బ్రాహ్మణులకు చవిటిభూమిని దానముచేసినందున ఆరాజు వృషభంబై అడవిలో దిరుగుచున్నాడు. ఆ కొలంకులు రెండును ధర్మంబొకటి అధర్మంబొకటి అని యెఱుంగుము. మానవుండు సర్వదా పరులనుదూషించుచు నుండినందున గాడిదయై తిరుగుచున్నాడు. పూర్వమందొకధనికుడు తనపెద్దలుచేసిన ధర్మమును విక్ర

యించి స్థితిజేర్చుకొన్నందున నాపురుషుడే యేనుగుగా జన్మించెను. అనంత పద్మనాభుండైన నేనే బ్రాహ్మణస్వరూపముతో నీకు బ్రత్యక్షమైతి గావున నీవీయనంతవ్రతమును పదునాలుగుసంవత్సరము లాచరించితివేని నీకు నక్షత్రస్థానంబిచ్చెదనని వచించి భగవంతుం డంతర్ధానమునొందె. పిదప కౌండిన్యముని తనగృహమునకువచ్చి భార్యతో జరిగిన వృత్తాంతమునెల్ల జెప్పి పదునాలుగుసంవత్సరములనంతవ్రతము నాచరించి యిహలోకమున పుత్రపౌత్రాదిసంపదల ననుభవించి యంత్యకాలమున నక్షత్రమండలము చేరెను. ఓ ధర్మరాజా! ఆమహాత్ముండగు కౌండిన్యుండును నక్షత్రమండలమునందు కానంబడుచున్నాడు. వ.ఆయు నగస్త్యమహాముని యీవ్రతంబాచరించి లోకమునం బ్రసిద్ధిచేసె. నగరదిలీప భరతహరిశ్చంద్ర జనకమహారాజు మొదలగు అనేకరాజు లీవ్రతంబొనర్చి యిహలోకమున రాజ్యముల ననుభవించి అంత్యమున స్వర్గముం బొందిరి. కావున నీవ్రతకథను సాంగముగా వినువార లిహలోకమున అష్టైశ్వర్యముల ననుభవించి పిదప యుత్తమ పదమునుం బొందుదురు.





శ్రీరస్తు.

# సుధనద్వాదశీ వ్రతకల్పము.

తులస్యశ్వత్థజన్మాని సదాస్నం కేశవప్రియే। కేశవార్చనయోగ్యే మే వరదా భవ సర్వదా॥ ధ్యాయామి॥ కృష్ణానందాశ్రుసంభూతే వరదే తులసీస్వయం। త్వామహం ద్యావాహయామ్యద్య శ్రీకమలాపతివల్లభే॥ ఆవాహయామి॥ అనేకహారసంయుక్తం సువర్ణమణిసంయుతం। రత్నసింహాసనం దివ్యం ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్॥ రత్నసింహాసనం సమర్పయామి॥ క్షీరోదధిసముత్పన్నే దేవాసురైః ప్రపూజితే। విష్ణుప్రియే మయా దత్తం గృహాణార్ఘ్యం నమోస్తుతే॥ అర్ఘ్యం॥ పద్మనాభప్రియే దేవి పాద్యమేతన్మయార్పితం। సంగృహాణ తుష్టా త్వం మే వరదే లోకపావని॥ పాద్యం॥ ఏలాలవంగకర్పూర చందనాద్యైస్సువాసితం। పానీయం చ మయానీతం సమ్యగాచమనీయకమ్॥ ఆచమనీయం॥ క్షీరాజ్యదధిభిస్సై, ఘృతైశ్శర్కరయా చ మధునా తథా। పంచామృతైస్స్నాపయిష్యే తులసి త్వాం నమో నమః॥ పంచామృతస్నానం॥ సుశీతలం సుప్రసన్నం సర్వౌషధిసమన్వితం। మయాహృతం జలం దేవి స్నానం కురు హరిప్రియే॥ శుద్ధోదకస్నానం॥ కౌశేయవస్త్రయుగం దేవి సర్వాభీష్టప్రదాయినీ। సర్వలక్షణసంపన్నే శుభ్రే త్వం ప్రదదామ్యహమ్॥ వస్త్రం॥ కంచుకం కాంచనం దివ్యం బ్రహ్మణా నిర్మితం పురా। అహం దాస్యామి దేవేశి విష్ణుపత్ని నమోస్తుతే॥ కంచుకాభరణం॥ స్వచ్ఛం నిర్మలమత్యర్థం పురతస్సుకృతం శుభం। కంఠసూత్రం గృహాణ త్వం దదామ్యాభరణాని చ॥ ఆభరణాని॥ చందనాగరుకర్పూర మృగనాభిసమన్వితం। గంధం గృహాణ దేవేశి దేవదేవాంగభూషణే॥ గంధః॥ శాలీయాన్ చంద్రవర్ణాంశ్చ హరిద్రామిశ్రితాన్ శుభాన్। అక్షతాంశ్చార్పయే తుభ్యం గృహాణ శ్రీహరిప్రియే॥ అక్షతాన్॥ మయా దత్తమిదం పుష్పం తులసీదళసంయుతం। మాల్యం గృహాణ దేవేశి వరదే విష్ణువల్లభే॥ పుష్పాణి సమర్పయామి॥

నమస్కారాన్ పంచపంచ ప్రకల్పయేత్ । తదాదిమాసపర్యంతం ప్రత్యహం చ సమాచరన్ ॥ ఊర్జేమాసి సితే పక్షే హ్యేకాదశ్యాముపోషితః । పూర్వవత్తు హరిపూజాం కృత్వా నియమపూర్వకమ్ ॥ రాత్రౌ జాగరణం కృత్వా అథ ద్వాదశ్యాం జితేంద్రియః । తతః ప్రభాతవేళాయాం స్నాత్వా సుచిరలంకృతః ॥ సుడుపే నచపిష్టేన కారయేద్విష్ణుప్రతిమం । ఏకం తులస్యై దత్వాతు బ్రాహ్మణాయైకమేవచ । ఉలూఖలేన్యస్య స్త్రాస్త్ర్యాక్షుముసలేన ఘట్టయేత్ ॥ యావంతః క్షీరకృష్ణతాస్యస్య శరీరే పతంతి హి । తావంత్యబ్దసహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥ శ్రీకృష్ణః ॥ పూర్వమాచరితం కైస్తు వ్రతమేతత్ఫలైషిభిః । దత్వా త్రితాచరణాత్కిం వై ఫలం ప్రాప్తం మహామునే ॥ నారదః ॥ పురా కశ్చిన్మహాతేజా బ్రాహ్మణోభూన్మహాప్రభో । వేదశాస్త్రార్థతత్త్వజ్ఞో దేవదత్తఇతి స్మృతః । సకదాచిద్విజశ్రేష్ఠో విచింత్యాస్మిన్ హ్యపుత్రకః । ఆరాధయామి దేవేశం విష్ణుం త్రైలోక్యపావనమ్ ॥ ఇతి సంచింత్య మనసా తత్ఫలప్రేప్సు దుర్లభం । వృద్ధబ్రాహ్మణరూపేణ ప్రాదుర్భూత్వాంతికే ॥ తపశ్చరంతం తం దృష్ట్వా విష్ణుః ప్రాహ మహావిభుః ॥ కిమర్థం క్రియమాణశ్చరత్నం తపో వద మహాద్విజ ॥ శ్రుత్వా తద్వాక్యమచిరాత్ ప్రణమ్య శిరసాహమ్ । దేవదేవ జగన్నాథ త్రాహి మాం పురుషోత్తమ ॥ అద్యైవ సఫలం జన్మ త్వత్పాదాంభోజదర్శనాత్ । మదీప్సితం చ న ఫలం భవిష్యతి న సంశయః ॥ అపుత్రకో మహాదుఃఖీ శరణం త్వాం ప్రజామ్యహమ్ ॥ పుత్రం దేహి మహాదేవ సర్వలోకవరప్రద ॥

నారాయణ ఉవాచ ॥ ఆయుర్హీనం సుతం వాపి సుతాం వా వృతభర్తృకామ్ ॥ తయోరేకం వృణీష్వాథ దదామి తవ సువ్రత ॥ దేవదత్త ఉవాచ ॥ స్వగృహం ప్రాప్య భార్యాయా ఏతద్వార్తాం నివేద్య చ । ఉభయోరేకమిచ్ఛామి హ్యాగమిష్యామి కేశవ ॥ ఇతి ప్రణమ్య శిరసా జగామ స్వగృహం ప్రతి ॥ నివేద్య సర్వం భార్యాయై బహుధాలోచ్య చింతితౌ ॥ భార్యోవాచ ॥ సుతా హి యాచ్యతాం స్వామిన్ భర్తృహీనాపి దివ్యయా । తథేత్యుక్త్వా స విప్రేంద్రః పునస్తం ప్రవిశ్య చ ॥ నారాయణ నమస్తేస్తు పుత్రికాం దాతుమర్హసి । తథేత్యుక్త్వా మహావిష్ణుః అంతర్ధానం యయౌ తథా ॥ అగృహ్య వరం మహావిప్రశ్చాగతః స్వగృహం ప్రతి । కించిత్కాలే వ్యతీతే తు పుత్రీ జాతా చ వై శుభా ॥ సర్వలక్షణ సంపన్నా సర్వరోగవివర్జితా । పితుర్గృహే తు సా కన్యా వర్ధితా చ సురూపిణీ ॥ తతః కాలే తు సంప్రాప్తే వివాహమకరోత్పితా । జన్మాంతరకృతాత్పాపాత్ సా జాతా నామృతభర్తృకా ॥ జనసీదనకౌ తస్యాస్తతః స్వర్గమవాపతుః । తద్గృహే విధ

సంపూజయేద్భక్తిపూర్వకం అఖండితంవసంవత్సరమేకైకస్యపృథక్పృథక్॥ గంధపుష్పాక్షతైర్ధూపైర్దీపైర్నైవేద్యసంయుతైః। నానావిధోపచారైశ్చ పూజయిత్వాయథావిధి॥ ప్రదక్షిణప్రణామాంశ్చ పంచపంచక్రమేణతు। రాత్రౌజాగరణంకుర్యాత్పురాణపఠనాదిభిః॥ తతఃప్రభాతవేళాయాం నద్యాంస్నాత్వాసమాహితః॥ గృహమాగత్యమేధావి పునః పూజాంసమాచరేత్। ఏవంకృత్వాద్విజశ్రేష్ఠ ఆచార్యాయకుటుంబినే॥ సశీలాయసుశాంతాయప్రతిమాందానమర్పయేత్। సువాసినీద్వయంచ సంధ్యకాబ్రాహ్మణసత్తమాన్॥ కృత్వాతుష్టాన్భోజనాద్యైర్వస్త్రైర్దక్షిణాభిర్విశేషతః। బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చాత్స్వయంభుంజీతబంధుభిః॥ ఏవంశక్త్యనుసారేణ విత్తశాఠ్యంనకారయేత్। నోద్యాపనం యేచ్ఛ్రితంయస్తు పునఃకష్టో భవిష్యతి॥ ఏవమాచరితంయైస్తు సర్వాభీష్టప్రదంవ్రతమ్। తేషాంభుక్తిశ్చముక్తిశ్చ భవత్యత్రనసంశయః॥ ఇత్యుక్త్వాథమహాలక్ష్మీ రంగధామనయయాతథా। ఏవంక్రమేణసా కన్యా కృత్వావ్రతముత్తమమ్॥ ఇహాభుక్త్వాధికంసుఖం మంతేస్వర్గంజగామహి। యేవంశతంతీదమాఖ్యానం శృణ్వంతి శ్రద్ధయాన్వితాః॥ తేపాపవినిర్ముక్తా యాంత్యంతిపరమాంగతిమ్॥ ఇతి భవిష్యోత్తరపురాణే-మథనద్వాదశీవ్రతకల్పస్సంపూర్ణః.

## మథనద్వాదశీ వ్రతకథ.

సూతపౌరాణికుండు శౌనకాదిమహర్షులం జూచి యిట్లనియె. ఓ మునివర్యులారా! యింకొక యుత్తమమైనవ్రతము చెప్పెదవినుండు. శ్రీకృష్ణమూర్తియొకతరి సత్యభామతోడ వనవిహారము సల్పుటకు బృందావనమునకుబోయెను. అట్టియెడ నారదమహాముని శ్రీకృష్ణదర్శనము సేయుటకు బృందావనమునకు వచ్చె. అంత శ్రీకృష్ణమూర్తి నారద మహామునిని అర్ఘ్యపాద్యాచమనీయములచే విధ్యుక్తముగ బూజించి ఆసనంబిచ్చి కూర్చుండనియమించి యిట్లనియె. ఓ మునీంద్రా! మీరు సకలలోకసంచారులు గనుక విశేషసంగతు లుండినయెడల ఆనతీయవలయునని అడిగిన నారదుండిట్లనియె. ఓ యశోదానందనా! నేనిప్పుడే బ్రహ్మలోకమునందుండి వచ్చుచున్నాను. బ్రహ్మ తనభార్యయగు సరస్వతీదేవికి యొకయుత్తమంబైన వ్రతంబానతిచ్చె. ఆవ్రతము చెప్పెదవినుము. ఆవ్రతము ఆచరించిన వనితాశిరోమణులకు సర్వసౌభాగ్యమును పుత్రపౌత్రాదులును గలుగుట

కు సంధియము లేదు. ఆవ్రతము ఆశ్వయుజశుక్లపక్షైకాదశినాడు ఉపవాస
ముండి సమాహితచిత్తులై తులసీసహిత శ్రీమహావిష్ణువును పూజింపవల
యు. మఱియు పంచపద్మములనలంకరించి అయిదుదీపములం బెట్టి గంధ
పుష్పధూపదీపాదులను అయిదువిధములైన నైవేద్యతాంబూలములను స
మర్పించి ప్రదక్షిణనమస్కారములం జేయువలయు, ఇట్లు ఆశ్వయుజశుక్ల
ఏకాదశిమొదలు నెలదినములవఱకు బూజసేయుచువచ్చి కార్తికశుద్ధఏకా
దశినాడుపవసించి పూర్వము చెప్పినచొప్పున శ్లోకోక్తప్రకారము తులసీ
సహితవిష్ణుమూర్తిని బూజచేసి రాత్రిజాగరణంబొనర్చి ద్వాదశినాడుదయ
మున నే స్నానముగావించి వస్త్రభూషణాద్యలంకృతులై యొకమానిక బి
య్యపుపిండిచే మూడుపిష్టకములుగాజేసి యొకటితులసికి నివేదనముచేసి
బ్రాహ్మణున కొకటియిచ్చి మిగిలిన యొకమద్దను రోటియందువైచి పా
లుపోసి రోకటిగడలచే దంచవలసినది. ఇట్లుదంచిన నాక్షీరబిందువులెన్ని
స్వశరీరమున నడుచున్నవో అన్నివత్సరములు స్వర్గలోకమునందు వసియిం
పుదురనిన కృష్ణమూర్తి యిట్లనియె. ఓ నారదమహాముని! యీవ్రతం బెవ్వ
రాచరించి యేమిఫలముపొందిరనిన నారదుండిట్లనియె. ఓ దేవకీనందనా!
పూర్వము ఉత్తరదేశమునందు వేదశాస్త్రార్థతత్త్వజ్ఞుండగు దేవదత్తుండను
నొక బ్రాహ్మణుండుగలడు. అతడు తనకు సంతానము లేమిం జేసి త్రై
లోక్యపావనుండగు విష్ణువుంగూర్చి తపంబొనర్పదలచి యొక మహారణ్య
మునకుంబోయి యొకగుంటనద్ద గూర్చుండి యత్యుగ్రంబగు తపమునలి
పె. అంత విష్ణుమూర్తి వృద్ధబ్రాహ్మణ రూపముతో అతనికి ప్రత్యక్షమై
ఓ విప్రోత్తమా! నీవేల యిట్టిఘోరంబగు తపంబొనర్చెదవు చెప్పుమనియ
డిగిన నాబ్రాహ్మణుండు శ్రీమన్నారాయణమూర్తికి ప్రదక్షిణ నమస్కార
ముచేసి జగన్నాథా! మీపాదదర్శనమువలన నాజన్మము సఫలంబయ్యె.
నే కృతార్థుండనైతిని. అని యనేకవిధముల స్తోత్రముచేసి నిలువంబడియుం
డు విప్రపుంగవుంగాంచి ఓ బ్రాహ్మణోత్తమా! నీకు కావలసిన వరమును
కోరుమనిన యాదేవదత్తుం డిట్లనియె. ఓ వాసుదేవా! "అపుత్రస్య గతి
ర్నాస్తి" యని ధర్మశాస్త్రములు పలుకుచుండుటవలన పుత్రులులేనివా
రికి గతులులేవు. కాబట్టి నాకు పుత్రుండుగలుగునటుల వరంబిమ్మని ప్రా
ర్థింప నారాయణమూర్తి యిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తముడా! ఆయువు
లేని కొమారునినైనను విధవయగు కూతురనైనను నిచ్చెద. ఈ యిద్దఱి
లో నీకెవరయిష్టమో చెప్పుమనిన నతండు యింటికిపోయి భార్యనడిగితె

లుసుకొనివచ్చివిన్నవించుకొనియెదనని చెప్పి యింటికిపోయి భార్యతో ఆలో
చింపగ విధవయగు కూతురుకలుగునటుల వరముకోరుమనిన నాబ్రాహ్మ
ణుండు మఱల ఆగుంటరొద్దకువచ్చి కమలనాభునకు నమస్కరించి కొ
మార్తకలుగునటుల వరంబిమ్మనిన నటులచేభర్తృవిహీనయగు కుమార్త
కలుగుగాక యని పలికి విష్ణుమూర్తి యంతర్ధానమునొందె. పిదప దేవ
దత్తుండు యింటికివచ్చి సుఖముగనుండె. ఇట్లు కొన్నిదినముల కాదేవదత్తు
నిభార్య గర్భముధరించి పదియవమాసమున పుత్రికంగనెను. ఆబాలిక నా
నాటికి వృద్ధిబొందుచుండెను. అంత వివాహకాలము వచ్చినతోడనే దాని
తండ్రియగు దేవదత్తుండు ఒకబ్రాహ్మణ చిన్నవానికి ఆకన్యకనిచ్చి వివా
హముచేసెను. ఇట్లు వివాహంబైన రెండుమూడుమాసములకే ఆచిన్న
దాని జన్మాంతర కృతపాపమువలన దానిమగండు మరణమునొందె. పిదప
కొద్దిరోజులలో తలితండ్రులును, కాలగతినొందిరి. అంత విధవయగుచి
న్నది తండ్రియింటనేయుండి ధర్మమునుగావింపక యింటికివచ్చినభిక్షుకులని
ల్ల "నాస్తినారాయణ నాస్తినారాయణ" యని చెప్పుచు భిక్షముపెట్టక
కఠినాత్మురాలై యుండెను. ఇట్లుండ శ్రీవిష్ణుమూర్తి యొకనాడు తనమన
మున నిట్లనివితర్కించె. ఓహో ఈవిధవ యింత దయాహీనురాలై యుండి
నను నారాయణనామమును మాత్రము పలుక స్మరించుచున్నదని సంత
సిల్లి బ్రాహ్మణరూపధరుండై ఆవిధవస్త్రీ యింటికేగి భిక్షపెట్టుమని యడ
డుగగా నానిర్దయురాలు నాస్తినారాయణయని చెప్పెను. అంత నాబ్రా
హ్మణవేషధారియగు వైకుంఠనాథుండు ఇట్లనియెను,

ఓ అమ్మా! ప్రాతఃకాలమునందు భిక్షుకువచ్చిన అతిథిని యీల అవమానిం
చుచున్నావనిన నావిధవ కండ్లెఱ్ఱజేసికొని మిగులకోపముతో తాను సలు
కుచున్నగుడ్డను బ్రాహ్మణవేషమువేసికొనియున్న జగద్రక్షకునిభిక్షాపాత్ర
యందు విసరివేసెను. అంత నాబ్రాహ్మణుండు అవతలికిదొలగిపోయి తన
పాత్రయందు చూడగా అలుకుగుడ్డతోడ నొకకందిగింజయుండెను. అంత
ఆనారాయణమూర్తి ఆకందిగింజను మొలకవేసి వైకుంఠమునకు పోయెను.
పిమ్మట కొన్నిదినముల కాకందిగింజ పెద్దచెట్టయి ఆకులు పుష్పములు కా
యలతో సంకూడియుండెను. విధవయును కొన్నిదినములకు మరణమునొం
ది పురుగుజన్మమెత్తి ఆకందిచెట్టునందున్న ఆకులందినుచుండెను. ఇట్లుం
డ కొన్నిదినములకు జగన్నాథుండు మహాలక్ష్మితోడ విధవస్త్రీయైన పురు

గుండు స్థలమునకువచ్చి ఓకీటకమా! భాగ్యవన్నావాయనిన ఆపురుగు ఓ జగదీశ్వరా! నీకు తెలియనివిషయం బేమియున్నది ఈరీతి అకులందినుచున్నాననిన లక్ష్మీదేవి భర్తంగాంచి ఓ ప్రాణనాథా! దీనికి యీపురుగుజన్మమువచ్చుటకు కారణంబేమి యని అడిగిన నారాయణమూర్తి ఆపురుగు విధవస్త్రీగా నుండినదిమొదలుకొని దానికి పురుగుజన్మము కలిగినవరకు వృత్తాంతంబెల్ల జెప్పినవిని మహాలక్ష్మి దీనికి కీటకజన్మ మెట్లు నివృత్తియగునని మరలయడుగగా విష్ణుమూర్తియిట్లనియె. ఓ ప్రాణనాయకీ! యీపురుగునకు కార్తీకశుద్ధ ద్వాదశినాడొనర్చిన వ్రతముయొక్క ఫలమునందు కొంచెమిచ్చినట్లైన పురుగుజన్మము నివృత్తియగుననిన శ్రీమహాలక్ష్మియు తత్క్షణమునయిచ్చెను. అంత ఆపురుగు స్త్రీరూపముదాల్చి లక్ష్మీనారాయణులకు ప్రదక్షిణనమస్కారముగావించి లక్ష్మీదేవితో నిట్లనియె. ఓ జగజ్జననీ! యీవ్రతము నేనాచరించెద నాకుపదేశింపుమని యనేకవిధముల ప్రార్థింప మహాలక్ష్మియిట్లనియె.

ఓ స్త్రీరత్నమా! కార్తీకశుక్ల ద్వాదశినాడు ఉపవాసముండితులసీబృందావనమును పంచవర్ణముగ్గులచేతను పంచపద్మములచేతను నలంకరించి ధూపదీపనైవేద్యములచే కల్పోక్తప్రకారము తులసీపూజచేసి ఆ రాత్రి పురాణపఠనాదులతో జాగరణముగావించి మరునాడు ప్రాతఃకాలమున స్నానంబొనర్చి శుద్ధవస్త్రములధరించి మొదటిదినమువలెనే తులసీపూజచేసి బియ్యపుపిండిచే మూడుముద్దలుచేసి యొకటి తులసికి నైవేద్యముచేసి యొకటి బ్రాహ్మణునకొసంగి మిగిలిన యొకటిని రోటిలోవేసి పాలుపోసి ముత్తయిదువులతోడ పాటలుపాడుచు రోకటచే దంచవలయును పిదప బ్రాహ్మణపూజ సువాసినీపూజలొనర్చి దక్షిణతాంబూలములొసంగి షడ్రసోపేతముగ నన్నముపెట్టి తృప్తులంజేసి తానును భుజియింపవలయును. ఇట్లు అయిదుసంవత్సరములు వ్రతమునాచరింపుచు వ్రతారంభమందైనను అంతమునందైనను ఉద్యాపనము చేయవలయును.

ఉద్యాపనక్రమంబుచెప్పెదవినుము. లక్ష్మీనారాయణ ప్రతిమలను శక్త్యనుసారముచేయించి పరిశుద్ధమగు స్థలమునందు గోమయముచేనలికి ముగ్గులుపెట్టి అందయిదువాసికల తెల్లబియ్యముపోసి అందులక్ష్మీనారాయణప్రతిమలనునిచి ప్రాణప్రతిష్ఠ గావించి ప్రతిమలకు వేర్వేరుగ క్రొత్త

వస్త్రములంగట్టి గంధపుష్పాక్షతలచేతను ధూపదీపనైవేద్యములచేతను నానావిధోపచారములచేతను లక్ష్మీనారాయణులను బూజించి అయిదేసిప్రదక్షిణనమస్కారములంజేసి ఆరాత్రి పురాణపఠన శ్రవణాదులచే జాగరణం బొనర్చి మఱుదిన ప్రాతఃకాలమున నదియందు స్నానముజేసి యింటికివచ్చి పుత్రపౌత్రాదియుక్తి శమదమాది గుణసంపన్నుండును కుటుంబియునగు పురోహితునకు ప్రతిమాదానముజేసి యిద్దఱు సువాసినులను పదియైదుగురు బ్రాహ్మణులను వస్త్రాలంకార భోజనాదులచే సంతృప్తులంజేసి పిదప బ్రాహ్మణ సమారాధనయొనర్చి తాను బంధువులతోడ భుజింపవలయు. ఇట్లు శక్త్యనుసారము వ్రతోద్యాపనము చేయవలయు. వ్రతోద్యాపనచేయనివారు పురుగుగా జన్మింతురు. కావున సర్వాభీష్టప్రదంబగు నీవ్రతముగా చించినవారు యిహలోకమున సకలైశ్వర్యముల ననుభవించి యంతమున స్వర్గసుఖం బొందుదురని మహాలక్ష్మీ వ్రతక్రమమును జెప్పి అంతర్ధానము నొందె. పిదప ఆస్త్రీయును మధుసూదనశ్రీవ్రతం బొనర్చి ఈలోకమున సకలసౌఖ్యముల ననుభవించి పరమున విష్ణుసాయుజ్యమునొందెను. ఈ వ్రతకథను శ్రద్ధాభక్తి సమన్వితులై వినువారును చదువువారును సకలపాప విముక్తులై యుత్తమపదము నొందుదురు.





శ్రీ ర స్తు.

# కేదారేశ్వర వ్రతకల్పము.

ఏవంగుణ-విశేషణ-విశిష్టాయాం-శుభతిథౌ-అస్మాకం-సకుటుంబానాం-క్షేమస్థైర్య విజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థకామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థసిద్ధ్యర్థం-ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థం-సత్సంతాన సౌభాగ్యశుభఫలావాప్త్యర్థం-వర్షేవర్షే ప్రయుక్త కేదారేశ్వరముద్దిశ్య కేదారేశ్వరప్రీత్యర్థం-కల్పోక్తప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే॥ ఆదౌ గణాధిపతిపూజాం కలశపూజాంచ కుర్యాత్-తతః కేదారేశ్వరపూజామారభేత్॥ అథధ్యానమ్॥ శూలంఢమరుకం చైవ దధానం హస్తయుగ్మకే। కేదారదేవమీశానం ధ్యాయేత్త్రిపురఘాతినమ్॥ ధ్యానం॥ కైలాసశిఖరే రమ్యే పార్వత్యాసహిత ప్రభో। ఆగచ్ఛ దేవదేవేశ మద్భక్త్యా చంద్రశేఖర॥ ఆవాహనం॥ సురాసురశిరోరత్న ప్రదీపితపదాంబుజ। కేదారదేవ మద్దత్త మాసనం ప్రతిగృహ్యతామ్॥ ఆసనం సమర్పయామి॥ గంగాధర నమస్తేస్తు త్రిలోచన వృషధ్వజ। మౌక్తికాసనసంస్థాయ కేదారాయ నమోనమః॥ పాద్యం సమర్పయామి॥ అర్ఘ్యం గృహాణ భగవన్భక్త్యా దత్తం మహేశ్వర। ప్రయచ్ఛ మే మనస్తుష్టిం భక్తానామిష్టదాయక॥ అర్ఘ్యం సమర్పయామి॥ మునిభిర్నారదప్రఖ్యైర్నిత్యమాఖ్యాతవైభవ। కేదారదేవ భగవన్ గృహాణాచమనం విభో॥ ఆచమనం సమర్పయామి॥ కేదారదేవ భగవన్ సర్వలోకేశ్వర ప్రభో। మధుపర్కం ప్రదాస్యామి గృహాణ త్వం శుభేన వై॥ మధుపర్కం॥ స్నానం పంచామృతం దేవ శ్రీశుద్ధోదకైరపి। గృహాణ గౌరీరమణ త్వద్భక్తేన మయార్పితమ్॥ పంచామృతస్నానం సమర్పయామి॥ నదీజలసమాయుక్తం మయాదత్తమనుత్తమం। స్నానం స్వీకురు దేవేశ సదాశివ నమోస్తుతే॥ శుద్ధోదకస్నానం॥ వస్త్రయుగ్మం సదాశుభ్ర మనోహరమిదం శుభం। దదామి దేవదేవేశ భక్త్యేదం ప్రతిగృహ్యతామ్॥ వస్త్ర

యుగ్మం సమర్పయామి ॥ స్వర్ణ యజ్ఞోపవీతంచ కాంచనం చోత్తరీయకం। రుద్రాక్షమాలయాయుక్తం దదామిస్వీకురుప్రభో॥ యజ్ఞోపవీతం॥ సమస్త గంధద్రవ్యాణాం దేవత్వం సిద్ధజన్మభూః। భక్త్యాసమర్పితం శ్రీత్యాహయా గంధాదిగృహ్యతాంశుభామ్॥ గంధాన్ సమర్పయామి ॥ అక్షతోసిత్వభావేన భక్త్యానామక్షతంపదం। దదాసినాథ పద్ధత్తాయి రక్షతైః శ్రీయుతాంభవాన్॥ అక్షతాన్॥ కల్పవృక్షప్రసూనైస్త్వం పూరైర్వరభక్త్యైర్వికసున్నరైః కుంకుమైః పార్థివైః కేశైః భాసిమర్చ్యతాంమయా॥ పుష్పాణి॥ తతఇంద్రాదిలోకపాలపూజాంకుర్యాత్॥ శివస్యదక్షిణేభాగే-బ్రహ్మణేనమః॥ ఉత్తరభాగే-విష్ణవేనమః॥ మధ్యే-కేదారేశ్వరాయనమః॥

## అథాంగపూజా.

మహేశ్వరాయనమః-పాదౌపూజయామి ॥ ఈశ్వరాయనమః- జంఘేపూజయామి॥ కామరూపాయనమః- జానునీపూజయామి ॥ హరాయనమః-ఊరూపూజయామి॥ త్రిపురాంతకాయనమః - గుహ్యంపూజయామి॥ భవాయనమః-కటింపూజయామి॥ గంగాధరాయనమః- నాభింపూజయామి॥ మహాదేవాయనమః-ఉదరంపూజయామి॥ పశుపతయేనమః-హృదయంపూజయామి॥ పినాకినేనమః-హస్తౌపూజయామి॥ శివాయనమః- భుజౌపూజయామి॥ శితికంఠాయనమః- కంఠంపూజయామి ॥ విరూపాక్షాయనమః-ముఖంపూజయామి॥ త్రినేత్రాయనమః-నేత్రాణిపూజయామి॥ రుద్రాయనమః-లలాటంపూజయామి ॥ శర్వాయనమః - శిరఃపూజయామి ॥ చంద్రమౌళయేనమః - మౌళింపూజయామి ॥ పశుపతయేనమః- సర్వాణ్యంగాని పూజయామి॥

## అథాష్టోత్తరశతనామ పూజా.

| | | | |
|---|---|---|---|
| ఓంశివాయనమః | నీలలోహితాయ | భక్తవత్సలాయ | కామారయే |
| మహేశ్వరాయ | శంకరాయనమః | భవాయనమః | అంధకాసుర సూ |
| శంభవేనమః | శూలపాణయే | శర్వాయనమః | దనాయనమః |
| పినాకినేనమః | ఖట్వాంగినేనమః | త్రిలోకేశాయ | గంగాధరాయ |
| శశిశేఖరాయ | విష్ణువల్లభాయ | శితికంఠాయనమః | లలాటాక్షాయ |
| వామదేవాయ | శిపివిష్టాయనమః | శివాప్రియాయ | కాలకాలాయ |
| విరూపాక్షాయ | అంబికానాథాయ | ఉగ్రాయనమః | కృపానిధయేనమః |
| కపర్దినేనమః | శ్రీకంఠాయ | కపర్దినేనమః | భీమాయనమః |

పరశుహస్తాయ
మృగపాణయే
జటాధరాయ
కైలాసవాసినే
కవచినేనమః
కఠోరాయనమః
త్రిపురాన్తకాయ
వృషాంకాయ
వృషభరూఢాయ
భస్మోద్ధూళిత వి
గ్రహాయనమః
సామప్రియాయ
స్వరమయాయ
త్రయీమూర్త
అనీశ్వరాయనమః
సర్వజ్ఞాయనమః
పరమాత్మనేనమః
సోమసూర్యాగ్ని
లోచనాయ
హవిషేనమః

యజ్ఞమయాయ
సోమాయనమః
పంచవక్త్రాయ
సదాశివాయ
విశ్వేశ్వరాయ
వీరభద్రాయ
గణనాథాయ
ప్రజాపతయేనమః
హిరణ్యరేతసే
దుర్ధర్షాయనమః
గిరీశాయనమః
అనఘాయనమః
భుజంగభూషణా
యనమః
భర్గాయనమః
గిరిధన్వనేనమః
గిరిప్రియాయ
కృత్తివాసాయ
పురారాతయే
భగవతేనమః

ప్రమథాధిపాయ
మృత్యుంజయాయ
సూక్ష్మతనవే
జగద్వ్యాపినే
జగద్గురవేనమః
వ్యోమకేశాయ
మహాసేనజనకాయ
చారువిక్రమాయ
రుద్రాయనమః
భూతపతయేనమః
స్థాణవేనమః
అహిర్బుధ్న్యాయ
దిగంబరాయ
అష్టమూర్తయే
అనేకాత్మనేనమః
సాత్వికాయనమః
శుద్ధవిగ్రహాయ
శాశ్వతాయనమః
ఖండపరశవేనమః
అజాయనమః

పాశవిమోచకా
సాంబాయ (య
మృడాయనమః
పశుపతయేనమః
దేవాయనమః
మహాదేవాయ
అవ్యయాయ
హరయేనమః
పూషదంతభిదే
అవ్యగ్రాయనమః
దక్షాధ్వరహరా
హరాయనమః
భగనేత్రభిదే
అవ్యక్తాయనమః
సహస్రాక్షాయ
సహస్రపదే
అపవర్గప్రదాయ
అనంతాయనమః
తారకాయనమః
పరమేశ్వరాయ

శ్రీ కేదారేశ్వరస్వామినేనమః। నానావిధపరిమళపుష్పాణిం పూజయామి.

## అథ సూత్రగ్రంథి పూజా.

శివాయనమః-ప్రథమగ్రంథిం పూజయామి। శాన్తాయనమః-ద్వితీయగ్రంథిం। మహాదేవాయనమః-తృతీయగ్రంథిం। వృషభధ్వజాయనమః-చతుర్థగ్రంథిం। గౌరీశాయనమః పంచమగ్రంథిం। రుద్రాయనమః-షష్ఠమగ్రంథిం। పశుపతయేనమః- సప్తమగ్రంథిం। భీమాయనమః-అష్టమగ్రంథిం। త్ర్యంబకాయనమః-నవమగ్రంథిం। నీలలోహితాయనమః - దశమగ్రంథిం। హరాయనమః-ఏకాదశగ్రంథిం। స్మరహరాయనమః- ద్వాదశగ్రంథిం। భర్గాయనమః-త్రయోదశగ్రంథిం। శంభవేనమః- చతుర్దశగ్రంథిం। శర్వాయనమః-పంచదశగ్రంథిం। సదాశివాయనమః- షోడశగ్రంథిం।

ఈశ్వరాయనమః-సప్తదశగ్రంథిం॥ ఉగ్రాయనమః-అష్టాదశగ్రంథిం॥ శ్రీకంఠాయనమః-ఏకోనవింశతిగ్రంథిం॥ నీలకంఠాయనమః- వింశంతిగ్రంథిం॥ మృత్యుంజయాయనమః-ఏకవింశతిగ్రంథింపూజయామి॥

శ్లో॥ దశాంగం ధూపముఖ్యంచ హ్యంగారవినివేశితం । ధూపంసుగంధైరుత్పన్నం త్వాంప్రీణయతుశంకర॥ ధూపం॥ యోగినాంహృదయేనైవ జ్ఞానదీపాంకురోహ్యహ । బాహ్యదీపో మయాదత్తో గృహ్యతాంభక్తగౌరవాత్॥ దీపం॥ త్రైలోక్యమపినైవేద్యం నతేతృప్తిస్తథాబహిః। నైవేద్యం భక్తవాత్సల్యాద్గృహ్యతాంత్ర్యంబకత్వయా॥ నైవేద్యం॥ నిత్యానందస్వరూపస్త్వం యోగిహృత్కమలేస్థితం । గృహాణభక్త్యామద్దత్తం తాంబూలంప్రతిగృహ్యతామ్॥ తాంబూలం॥ అర్ఘ్యంగృహాణభగవన్ భక్త్యాదత్తం మహేశ్వర । ప్రయచ్ఛమేమనస్తుష్టిం భక్తానామిష్టదాయక॥ పునరర్ఘ్యం॥ కర్పూరంచంద్రసంకాశంజ్యోతిస్సూర్యమివోదితం। భక్త్యాదాస్యామికర్పూరనీరాజనమిదంశివ॥ నీరాజనం॥ భూతేశభువనాధీశ సర్వదేవాదిపూజిత। ప్రదక్షిణంకరోమిత్వా వ్రతంమేసఫలంకురు॥ ప్రదక్షిణం॥ హరశంభోమహాదేవ విశ్వేశామరవల్లభ। శివశంకరసర్వాత్మ నీలకంఠనమోస్తుతే॥ నమస్కారం॥ అభీష్టసిద్ధింకురుమే శివావ్యయమహేశ్వర । భక్తానామిష్టదానార్థం మూర్తీకృతకళేబర॥ ప్రార్థనా॥ కేదారదేవదేవేశ భగవన్నంబికాపతే। ఏకవింశద్దినేతస్మిన్ సూత్రంగృహ్ణామ్యహంప్రభో॥ సూత్రగ్రహణం॥ ఆయుశ్చవిద్యాంచతథాసుఖంచ సౌభాగ్యవృద్ధింకురుదేవదేవ । సంసారఘోరాంబునిధౌనిమగ్నంమాంరక్ష కేదారనమోనమస్తే॥ తోరబంధనం॥ కేదారప్రతిగృహ్ణాతు కేదారోవైదదాతిచ। కేదారస్తారకోభాభ్యాం కేదారాయనమోనమః॥ వాయనదానం॥ కేదారప్రతిమాయస్మాత్సాజ్యసౌభాగ్యవర్ధనీ। తస్మాదస్యాఃప్రదానేన మమాస్తుశ్రీరచంచలా॥ ఇతి ప్రతిమాదానమంత్రః॥ ఇతిపూజావిధానం సంపూర్ణం.

## కేదారేశ్వరవ్రత కథారంభః.

సూతఉవాచ:—యస్యప్రసాదాద్భువనంప్రకీయతేసచరాచరం। తంప్రణమ్యమహాదేవంభగవంతముమాపతిమ్॥ కేదారవ్రతమాహాత్మ్యంసర్వకల్యాణకారణం। ప్రవక్ష్యామిజగద్భూత్యై మునిభిశ్చపురాకృతమ్॥ వ్రతంశంకరదేహార్ధం దేవ్యాయత్ప్రాప్తిచర్యయా। యద్వ్రతంచరతాంలోకే సంభవతివిభూతయః॥ ఆరోగ్యమాయుఃకీర్తిశ్చపుత్రార్థంతేశ్రుణ్వతామిదం। ఏకవింశతివా

రాన్య శ్చరత్యేతద్వ్రతోత్తమమ్॥ ఇహాముత్రచకల్యాణ విందతిధ్రువముత్త
మం। వ్రతంసమాచరన్మర్త్యస్సౌభాగ్యంకాంతిమేవచ॥ ఆయుశ్శ్రియంచల
భతే శివలోకేమహీయతే। తస్మాద్ద్విజోవారాజావా వైశ్యశ్శూద్రఏవవా॥
యేచాప్యన్యేనరాఃకుర్యు స్స్వయంతాంవ్రతముత్తమమ్॥ అస్తిపూర్వోత్తరేభా
గేపృథివ్యాంధరణీధరః॥ కైలాసఇతివిఖ్యాత శ్రీమాన్‌లోకనమస్కృతః। రా
జితైర్వివిధైశ్శృంగైస్సర్వరత్నవిచిత్రితైః॥ తటద్గణసమాకీర్ణై శ్శారదా
భ్రోపస్థితైః॥ నానాద్రుమలతాకీర్ణై ర్నానాపుష్పఫలైర్యుతైః॥ నానా
విహగసంఘుష్టై ర్నానానిర్ఝరసంయుతైః। సాలై స్తమాలై స్తిలకై ర్హింతా
లై ర్వకులై రపి॥ అశోకైఃకంకణై ర్నింబై శ్చందనై ర్దేవదారుభిః। నారికేళా
మ్రపనస పూగపున్నాగచంపకైః॥ చూతైశ్చాన్యైశ్చతరుభి శ్శోభితఃపుణ్య
కాననైః। ఏతస్యశిఖరేరమ్యే యోగిబృందనిషేవితే॥ యక్షకిన్నరగంధర్వ
సిద్ధవిద్యాధరై ర్వృతే। సమాసతివిశ్వాత్మా పినాకీ ప్రమథైర్వృతః॥ అం
బికాసహితశ్శ్రీమాన్ సర్వదేవసమస్కృతః। ఏకదాతస్యశిఖరే రుద్రాణీ
సహితశ్శివః॥ తథాప్రకుర్వన్ వసతింసురాణాం దర్శనంవదౌ। అగ్నిర్వా
యు స్తథాదిత్య శ్చంద్రమాస్సహతారకః॥ బ్రహ్మాదయోవసిష్ఠాద్యాస్తే స
ర్వేతంసిషేవిరే। రంభాతిలోత్తమాచైవ సహజన్యాచమేనకా॥ యాశ్చా
న్యాదేవవనితాః పరితస్తుపినాకినం। మాతరశ్చండికాద్యాశ్చ కార్తికేయో
గజాననః॥ నంద్యాదయోదేవగణా స్స్వాహాస్వధాసహితాస్థితాః। ఏవంప్ర
వర్తమానాయాం సభాయాంరుద్రసన్నిధౌ॥ నారదప్రముఖా స్తత్రవీణాగుస్తైన
ప్రచోదితాః। తేషాంప్రవృత్తేమధురే గీతేసర్వమనోహరే॥ వాదిత్రలయ
సంయుక్తా ననృతుశ్చాప్సరోగణాః। తాసామప్సరసాంమధ్యే రంభానర్తనరం
గసుందరీ॥ మధురంలాస్యమకరో త్స్వాంగీర్వాణసమ్మతం। తత్రభృంగిరి
టిర్నామ సమయేశివసన్నితమ్॥ అద్భుతం వికటంనృత్తం మకరోద్ధర స
న్నిధౌ। తత్రప్రవర్తతే హాసస్సురాణాంశివయోః పురః॥ మహాకలకలశ్చా
సీద్గిరికందరపూరణః। ఏవంప్రహాసనాంతేషాం శ్రీమాన్ సర్వేశ్వరోఽబ్రవీత్॥
సాధుభృంగిరిటేసమ్యక్ కృతంప్రహసనం త్వయా। ఇత్యుక్త్వాథభగవాన్
తస్మై ప్రసాదమకరోద్విభుః॥ హరప్రసాదాత్సుప్రీత స్సురైశ్చబహూ
కృతః। హరంప్రదక్షిణీకుర్వన్ వినాదేవీంసమాహితః॥ ప్రణామమకరో
త్తస్మై వినయేనసమన్వితః। తతోదేవ్యబ్రవీద్వాక్యం దేవముద్వీక్ష్యసస్మి
తా॥ మద్భాగంపరిహృత్యాసౌ కృతవాన్ త్వత్ప్రదక్షిణమ్। ప్రణామస్యాకిమే
తస్య కారణంపరమేశ్వర॥ బ్రూహిమేతత్త్వతస్సర్వం శ్రోతుంకౌతూహలం

గాహనంపునః । ఆవాహ్యదేవంతత్రైవ ప్రతిష్ఠాప్యయథావిధి । చందనాగ
రు కర్పూరకస్తూరీకుంకుమాదికాన్ । గంధాంశ్చవివిధాన్ దేవి పుష్పాణివి
విధానిచ । తాంబూలానివిచిత్రాణి వాసాంసిచనివేదయేత్ । పుష్పైరభ్య
ర్చ్యవిధివద్ధూపదీపాదిభిశ్శివం । గోధూమపిష్టసంక్లిప్తానేకవింశతి సంఖ్య
కాన్ । అపూపాన్మృష్టమన్నంచ పాయసంగుడసంయుతం । దధ్యాజ్య మ
ధుసంయుక్తమనేకైర్వ్యంజనైర్యుతం । ఫలైరనేకైస్సంపూర్ణం కదళీపన
సామ్రకైః । సర్వాన్నివేద్యదేవాయ కృత్వాచమనీయకమ్ । తాంబూలం
చనివేద్యాథ స్తోత్రంకుర్యాద్యథేప్సితం । కృత్వాదేవస్య పూజాంచ దేవికే
దారనాయకమ్ । యథాశక్తిసువర్ణాది బ్రాహ్మణేభ్యఃప్రదాయచ । వ్రతం
సమాప్యవిధివత్ప్రీణయన్త్సత్రిలోచనం । ఇత్యుక్త్వాచచక్షే మునిరప్యథార్యా
తద్వ్రతేష్టితా । తతః ప్రీతోమహాదేవ స్సర్వదేవగణైస్సహ । ఆగత్యాస్య
శరీరార్ధం భవత్యైదాస్యతిస్వయం । ఏతద్భవానిసుప్రీతా శ్రుత్వాగౌతమ
భాషితం । యథానిర్దిష్టమృషిణాతథా సర్వంసమాచరేత్ । తతఃప్రీతమనా
భూత్వాభగవాన్ వృషభధ్వజః । గత్వాదేవగణైస్సార్ధం స్వదేహార్ధందదౌ
హర । తతోభవానీసుప్రీతా శంకరార్ధతనుమేత్యచ । దేవంప్రసాదయామా
సలోకానాంహితకామ్యయా । దేవప్రసాదాత్తేలోకే చరంత్వేతద్వ్రతం
జనాః । యోయంప్రార్థయతేబుద్ధ్యాతత్సర్వం సమవాప్నుయాత్ । ఇతిప్ర
సాదితోదేవ్యా భగవానంబికాసఖః । తథేత్యుక్త్వాసురగణైస్సత్రైవాం
తరధీయత । తతశ్చిత్రాంగదోనామ గంధర్వశ్శివభక్తిమాన్ । వ్రతవర్యా
క్రమంలేభేనందికేశ్వరపార్శ్వతః । సమనుష్యవిమానంప్రాప్య వ్రతమేతద్దిశా
మ్యహం । ఏవంసతువినిశ్చిత్య జగామోజ్జయినీంపురీమ్ । స్వరాజసంతాయవిధివ
దదౌరాజ్ఞేవ్రతంసుధీః । వ్రతమేతన్మనుష్యాణాం సముహాన్సంభవత్ప్రభుః । అథా
భూతాంవైశ్యసుతే తస్యాంచపురికన్యకే । ఏకాంపుణ్యవతీంప్రాహు రన్యాం
భాగ్యవతీంవిదుః । తేకస్యచిత్సంప్రాప్య బభాషాతే ప్రియంవచః । మహా
త్మన్ కేదారదేవస్య వ్రతంకర్తుంప్రసీదమే । తాభ్యామేవంనిగదితే పితేత్థం వా
క్యమబ్రవీత్ । వత్సేబ్రూతం దరిద్రోహంకథముత్పాద్యతేమయా । సాను
గ్రీచాస్యనాస్త్యేవ యువాభ్యాంతత్త్వముచ్యతాం । ఇతిపిత్రాసమాదిష్టే కన్యే
పునరవోచతామ్ । అనుజ్ఞాతేత్వయాతాత కర్తుమిచ్ఛావసువ్రతం । త్వద
నుజ్ఞైవనియతమావయోః పరమంధనమ్ । ఇత్యుక్త్వాతేవైశ్యేన కృతానుజ్ఞే
అథకన్యకే । కస్మింశ్చిద్రుచిరేదేశే వటవృక్షసమాశ్రితే । బద్ధ్వాప్రతిసరం
తత్రచక్రాతేస్యాంయథావిధి । ఏకయోభక్తిశీలేన తత్సానుగ్రీందదౌహ

నులు రంజిల్లునటుల వికటనాట్యమొనరించె. అనంతరమున భృంగియను భక్తవరుం డాస్వామిసన్నిధియందు తత్ప్రీతికరంబగు వికటనాట్యము చేయగా నాపార్వతి కైలాసాధిపతియొక్క పూర్వభాగమునందు వుంను. అప్పుడు నిఖిలదేవతలకు మిక్కుటమైనహాసము జనించె. నట్టి ఆశ్చర్యకరంబగు హాసమువలన నప్పుడాపర్వతగుహాళు నిండునటుల గొప్ప కలకలధ్వనిగలిగె. నిట్లు హాసము విస్తరిల్లుచుండ సర్వేశ్వరుండగు శంకరుండా భృంగిరిటినింజూచి నీచేత మిగులహర్షప్రవర్ధకంబైననాట్యము చేయబడెనని సెలవిచ్చి ముదంబంది యాభక్తునియం దనుగ్రహించె. నంతట నాభృంగిరిటికి శివానుగ్రహంబు గలుగుటంజేసి యతండు ప్రీతుండై సకల విబుధులచేత గౌరవింపబడి సమాహితచిత్తుడై వినయముతోగూడి యాపార్వతీదేవినివదలి యీశ్వరునికి మాత్రము ప్రదక్షిణమొనర్చి నాస్వామికి వందనమాచరించె, నపుడు అప్పూజ్యురాలగు మృడానియు చిఱునవ్వుతో గూడినదై తనభర్తయగు పరమేశ్వరునివీక్షించి ఓస్వామీ! ఈ భృంగిరిటి నన్నువిడిచి మీకుమాత్రము ప్రదక్షిణంబాచరించుటకు గారణంబేమి. వినవేడుకైయున్నది యానతీయవే యనివేడగా నాశశిశేఖరుండు ఓ ప్రియురాలా! చెప్పెదవినుము,

పరమార్థవిదులగు యోగులకు నీవలనం బ్రయోజనము లేమింజేసి నన్ను నమస్కరించిరని సెలవివ్వగా నాపరమేశ్వరి మిగులప్రీతినిబొంది ఆ భర్తయందున్న తనశక్తి నాకర్షించగా నాస్వామి త్వగస్థివిశిష్టమాత్రావయవుండాయెను. నంతట నాదేవియు శక్తిహీనురాలై వికటురాలాయెను. పిదప నాదేవికోపించి దేవతలచేత నూరడింపబడినదై కైలాసమును వదలి తపంబొనరించుటకు నానావిధములగు సింహశరభశార్దూలగజవ్యాఘ్రాదులచేత సేవింపబడియు నిత్యవైరంబుడిపియున్న పన్నగగరుడాది సకలజంతువులచే నిబిడంబగు నానావిధవృక్షలతాగుల్మాది భూయిష్ఠంబై ఋషిశ్రేష్ఠసేవితంబై సర్వాభీష్టప్రదంబై యొప్పుచున్న గౌతమాశ్రమమును బ్రవేశించె, లంత నాగౌతముండు వన్యంబులై హోమయోగ్యంబులగు సమిత్కుశఫలాదులను సంగ్రహించుకొని వనమునుండి వచ్చునెడ తన యాశ్రమభాగమున వెలుగుచున్న ప్రకాశమునుజూచి ఋష్యాశ్రమంబగు నిది మిగులశోభిల్లుచున్నయది యని విస్మయంబంది తత్కారణము జింతించుచు తనయాశ్రమమును ప్రవేశించి తామరరేకులవంటి కన్నులుగలిగి యలంకృతురాలై యున్న ఆమహేశ్వరింగనుంగొని ఓపూజ్యురాలవైన భగవతీ! నీవిచ్చటికే

# కేదారేశ్వర వ్రతకథ.

మాటలకు గారణంబేమి యని అడుగ నద్దేవియు నా జటాభారికి దన విషాదకారణమును వచించి నమస్కరింపుచు ఓయి మునీశ్వరుడా! యే వ్రతము యోగిప్రియంబైనది. ఏ వ్రతానుష్ఠానముచేత శంకరదేహార్ధము నాకు ఘటించుచున్నది. అట్టివ్రతము నుపదేశింపుమనగా నామహర్షి సకలశాస్త్రపురాణావలోకనంబాచరించి యీప్సితార్థప్రదంబగు శ్రీమత్కేదార నామకంబైన యుత్తమవ్రతము నాచరింపుమని యుపదేశింపగా నంతనాదేవియు నావ్రతానుష్ఠానక్రమం బానతీయవే యని వేడగా నిట్లని చెప్పందొడంగె. భాద్రపదశుక్లాష్టమియందు శుద్ధమనస్కురాలవై మంగళకరంబులగు నేకవింశతి తంతువులచేత హస్తమునందు ప్రతిసరమును ధరించి యాదినమందు ఉపవాసము సలిపి మరునాడు బ్రాహ్మణభోజనము జేయించి అదిమొదలు అమావాస్యవరకు నీవ్రతము నిట్లు సలుపుచు ప్రతిదినమునందును శ్రీమత్కేదారదేవు నారాధింపవలయు. మఱియు శుద్ధంబగు నొక్కప్రదేశమున ధాన్యరాశినించి యందు పూర్ణకుంభము నిల్పి ఇరువదియొక్క సూత్రములచేత జుట్టి పట్టువస్త్రములచేత గప్పియుంచి నవరత్నములనుగాని శక్తికొలది సువర్ణముగాని యునిచి గంధపుష్పాక్షతలచేత నర్పించి ఇరువదియొకరైన బ్రాహ్మణులను బిలుపించి పాదప్రక్షాళనాది కృత్యంబులాచరించి కూర్చుండనియోగించి అచ్చట నా కేదారదేవుని ప్రతిష్ఠింపంజేసి చందనాగరు కస్తూరికుంకుమాదులను శ్రీగంధమును నానావిధపుష్పములను తాంబూలమును వస్త్రములనునునిచి నివేదనము నొనరించి యథాశాస్త్రముగ ధూపదీపాదులచేత బూజించి యేకవింశతి సంఖ్యాకంబులైన యపూపములను షడ్రసోపేతములైన చోష్యలేహ్యాదులను కదళీపనసామ్రాదిఫలములను నైవేద్యముజేసి తాంబూలములొసంగి చక్కగా స్తోత్రముజేసి బ్రాహ్మణులకు యథాశక్తి దక్షిణలిచ్చి వ్రతమును లెస్సగా నుష్ఠించి ఈశ్వరునకు మనస్సంతుష్టాంతరంగుడై అచ్చటికి దేవగణములతో డందని స్వశరీరార్ధమునిచ్చెదనని యివ్వగా నప్పార్వతియు పొంగి శంకరదేహార్ధమును బొంది లోకానుగ్రహము జేయదలంచి భర్తయగు నీశ్వరునితో నీవ్రతము నాచరించువారలకు సకలాభీష్టసిద్ధికలుగునటుల యనుగ్రహింపుతీరని యెల్లవారు నాచరింతురనగా నట్లుగాకయని నంగీకరించి సురసంఘములతోగూడ నప్పుడు నంతర్హితుండయ్యె. మఱికొంతకాలమునకు శివభక్తియుక్తుండగు చిత్రాంగదుడను గంధర్వుండు నందికేశ్వరునివలన నావ్రతచర్యాక్రమంబెఱింగి మనుష్యలోకమునకుంజని వారలకుపదేశింపవలయునను నిచ్ఛగలవాడై యుజ్జయినీపట్టణ

కేదారేశ్వర వ్రతకథ.

నంది వజ్రదంతుడను రాజునకుఁ జెప్పింప నతండు నవ్రతమును కల్పో
ప్రకారముగ నాచరించి సార్వభౌముండాయె.

మఱి కొంతకాలమునకు నాపట్టణమునను న్న వైశ్యునకు పుణ్యవతి
యు భాగ్యవతియునియు నిద్దఱుకొమార్తెలుగలిగిరి, వారిద్దఱును తండ్రి
సుకుంబోయి కేదారవ్రతమాచరించు నట్లాజ్ఞయొసంగుమనివేడగా నేను
రిద్రుండను దానికి వలయుసామగ్రి లేమిం జేసి యీ సంకల్పము మా
నగా ఓ తండ్రీ! నీయనుజ్ఞ మాకు పరమధనముగాన నాజ్ఞయొసంగు
సెలవు పుచ్చుకొని యొక వటవృక్షమూలమున గూర్చుండి వ్రతినగము
ని యథావిధిగాబూజింప వారలభక్తికిమెచ్చి యీశ్వరుడప్పుడు వల
మగ్రినియిచ్చెను. అంతట వారలు చక్కగా వ్రతము నాచరించుట
హాదేవుండు ప్రీతుండై యక్కన్యలకాయురారోగ్యైశ్వర్యము
రముల నొసంగి యంతర్హితుండయ్యె. పిమ్మట నావ్రతమాహా
నుజ్జయినీపట్టణ మేలుచున్నరాజు పుణ్యవతియను నొక కన్య
లుడు భాగ్యవతియనుకన్యను పాణిగ్రహణ మొనరించి రం
ంబు ధనసమృద్ధుండై సామ్రాజ్యసంపదలను బుత్రులను
నుచుండె నంత వారిలో రెండవదియైన భాగ్యవతియనునది
మోహితురాలై కొంతకాలమునకు నావ్రతమును విడిచెను.
గ్యహీనులై పుత్రునితోగూడ పెనిమిటిచేతవెడల నంపబడి
వనచారకున్నురాలై యొకబోయవానియిల్లుజేరి యచ్చటం వు
ఓపుత్రుండా! నాయక్కయగు పుణ్యవతియు యుజ్జయినీ పట్టణపు
వాహామైయున్నవాడు నీవచ్చటికింజని దానింజూచి ధనముదీసుకొని
ముగరమ్మనగా నతండాపట్టణమునకుబోయి పెద్దతల్లితో తనతల్లియొ
దున్నహీనంబగు కష్టముకు దెలుపగా నాపుణ్యవతియు నతనిచేతికి విస్తా
ంగ ధనమునిచ్చె. నంత యతం డాధనము దీసుకొనివచ్చునెడల మార్గ
మున నదృశ్యరూపుండైన యుద్దేవునివలన నాధనం బపహరింపబడగా నతం
డు మరల నచటికేతెంచి ఆవృత్తాంతమువిన్నవించ మఱికొంతధనము సం
గ్రహించుకొనిరాగా నాధనమునుగూడ హరించగా దూయమాన మాన
సుండై నిలుపంబడి యున్నవానితో నీశ్వరుం డదృశ్యుండై ఓచిన్నవాడా!
పతిభక్తిష్టులకు నీధనముగ్రహించ నలవిగాదని చెప్పగా నావాక్యమువిని విస్మ
యుంబంది ఆచిన్నవాడు మరల పూర్వమువలె నచటికింజని ఈశ్వరోక్తంబ
గు వృత్తాంతమును దెలుపగా నాపుణ్యవతి ఆలోచించి పుత్రునిచేత వ్రతం

## కే దా రే శ్వ ర వ్ర త క థ.

బొనరింపజేసి తనచెల్లెలు వ్రతమాచరించునటుల జెప్పవలయునని ప్ర
లాపంగింపగా నతండు బయలుదేఱివచ్చునెడ మార్గమున నప్రయ
గ పూర్వముగోనిపోయిన ధనమంతయు స్వవశమైనందున సంతసించి
ముగ్రహించుకొని కాంచీపట్టణమును బ్రవేశించునమయమున చతు
బలములతోడ తనతండ్రి యెదుర్కొనివచ్చి వెంటబెట్టుకొని పట్టణము
జనియె. నంతట తల్లితండ్రులతోఁగూడి సుఖముల నుభవించుచుండె
మ్మట తల్లియగు పుణ్యవతియును తండ్రియగు చోళరాజును నడిచి
వ్రతము నాచరించుచు అవిచ్ఛిన్నంబగు నిఖిలసంపదలనుభవించుచు
న నెవ్వరైనను యథోక్తప్రకారము నీవ్రతమాహాత్మ్యమును భ
లై వినిన జదివిన నట్టివారలందఱును శ్రీమహాదేవుని యనుగ్రహ
ననంతంబులగు నాయురారోగ్యయశములనుబొంది సుఖములన
వసాయుజ్యమును బొందుదురని గౌతమమహర్షిచే జెప్పంబడె
డు శౌనకాదులకుజెప్పిన యట్లు శ్రీవ్యాసభట్టారకుండు స
మునం దభివర్ణించె ననుట.

### కే దా రే శ్వ ర వ్ర త క ల్ప ము.

### సం పూ ర్ణ ము.




నాతా. జగన్నాయకులు శెట్టి,
నెం. 186. దేవరాజమొదలివీధి, మదరాసు.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 103 B130 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |